# పరాయీకరణ

## పరిణామాలు-పర్యవసానాలు

(వ్యాస సంకలనం)



సంకలనం & సంపాదకత్వం

గౌరవ్

# పరాయీకరణ

## పరిణామాలు - పర్యవసానాలు

## (వ్యాస సంకలనం)



ప్రచురణ :

జూన్, 2021

ప్రతిపాదిత విరాళం

ఐచ్ఛికం

ప్రతులకు

9032094492

వివరాలకు

gouravmeka@gmail.com

విజ్ఞప్తి

ఇందులోని వ్యాసకర్తల అభిప్రాయాలన్నింటితోనూ
సంపాదకుడు విధిగా అంగీకరించవలసిన అవసరం లేదు.




"తత్వవేత్తలు కేవలం ప్రపంచాన్ని అనేకరకాలుగా
వ్యాఖ్యానించారు. అసలు విషయం ఏంటంటే,
ప్రపంచాన్ని మార్చాలి."

– కార్ల్‌మార్క్స్

# విషయ సూచిక

# ప్రస్తావన

మిత్రులు రావుకృష్ణారావు గారి 'ఎలియనేషన్' (మార్క్స్ పరాయీకరణ సిద్ధాంత సంక్షిప్త పరిచయం) పుస్తకం విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ 2020, సెప్టెంబరులో ప్రచురించింది. ఆ పుస్తకం గురించిన సమాలోచన సమావేశం 2021, ఫిబ్రవరిలో తూ.గో.జిల్లా రామచంద్రపురంలో డా॥ చెలికాని రామారావు స్మారక సమితి ఆధ్వర్యంలో జరిగింది. రచయితతో సహా అంశంపై ఆసక్తికల కొద్దిమంది బుద్ధిజీవులు ఉత్సాహంగా పాల్గొన్న ఈ సమావేశంలో వివిధ విలువైన అభిప్రాయాలు చర్చకి వచ్చాయ్.

సమన్వయకర్తగా వ్యవహరించిన నేను, వక్తలుగా పాల్గొన్న కొద్దిమంది ప్రసంగాలను లిఖితపూర్వకంగా రాసి పంపవలసిందిగా కోరాను. అనేక కారణాల వల్ల ఆ పని అనుకున్నంత త్వరగా అవలేదు. ఈలోగా కోవిడ్-19 సెకండ్ వేవ్ కారణంగా దేశంలో గడ్డు పరిస్థితులు నెలకొన్నాయి. మొత్తం వ్యవస్థ అల్లకల్లోలమైపోయింది. దేశం కాష్ఠమైంది. ఈ పరిస్థితుల్లో ఆలస్యంగానైనా ఆనాటి సమాలోచనా సారాన్నీ ఇలా పుస్తకరూపంలో తీసుకువస్తున్నాను. ఎప్పటికైనా మానవాళి అధిగమించాల్సిన ఒక విషమ సమస్య, పరాయీకరణ!

'పరాయీకరణ' గురించిన నా వ్యక్తిగత ఆసక్తే ఇదిలా ప్రచురించడానికి ప్రధాన కారణం. తెలుగులో ఈ అంశం మీద జరగాల్సినంత దార్శనిక సంవాదం జరగలేదనే అసంతృప్తి కూడా దీనికి ప్రేరణ. ముఖ్యంగా ఆరోజు 'పరాయీకరణ' గురించిన సమాలోచనల్లో పాల్గొన్న కొద్దిమంది వక్తల వరకే ఇందులోని వ్యాసాల్ని సేకరించడం జరిగింది. ఆ మేరకు అసమగ్రం అయినప్పటికీ ఇప్పటికీ విధంగా శక్తిమేరకు చేస్తున్న పరిమిత ప్రయత్నంగా దీనిని గుర్తించాల్సిందిగా పేర్కొంటూ, మరింత సుసంపన్నమయిన ప్రయత్నాలు ఈ అంశంపై భవిష్యత్తులో జరగాలని ఆశిస్తూ, ఆపుతాను. వ్యాసకర్తలకి ధన్యవాదాలు, విమర్శలకి ఆహ్వానం.

**- సంకలనకర్త**

# 1

# పరాయీకరణ - మానవ స్వభావం

- **డా. పి.యస్. ప్రకాశరావు,** రచయిత & అనువాదకులు,
సెల్ : 9963743021

మానవ స్వభావం గురించి మనం ఎందుకు తెలుసుకోవాలి? అనే ప్రశ్నతలెత్తినపుడు పరాయీకరణకు చెప్పిన నిర్వచనాన్ని ఒకసారి గమనించాలి. “మనిషి తన స్వభావానికి తగినట్టు జీవించలేకపోవడమే పరాయీకరణ'' అంటారు. కాబట్టి అసలు మనిషి స్వభావం అంటే ఏమిటో తెలిస్తే అతని జీవన విధానం దానికి తగినట్టు ఉందో లేదో తెలుస్తుంది.

మానవ స్వభావ లక్షణాల గురించి సమాజంలో ఒక ప్రచారం ఉంది. మానవుడు స్వతహాగా స్వార్ధపరుడు, అత్యాశపరుడు, కీర్తికాంక్ష, అధికార వ్యామోహం ఎక్కువ. అంటూ ఈ భావజాలాన్ని బాల్యం నుంచే బడిలో నీతికథల రూపంలో నూరిపోశారు. పెద్దవారికి కూడా భగవద్గీత, భర్తృహరి సుభాషితాలు వంటివి కూడా ఇవే బోధించాయి. సమాజంలో మనకు ఇలాంటి వ్యక్తులు తారసపడుతుంటారు కాబట్టి ఇవి నిజమే అనిపిస్తాయి. కానీ సమాజ చరిత్రను గమనిస్తే ఇవన్నీ వాస్తవాలు కాదని అర్థమవుతుంది. ఆదిమ కమ్యూనిస్టు సమాజంలోనూ, మార్క్స్ చెప్పిన భవిష్యత్తులో రాబోయే సమాజంలోనూ మానవుడిలో ఈ లక్షనాలు కనిపించవు.

మరి ఈ భావజాలం ఇంతిలా ప్రచారంలోకి వచ్చి ప్రజల మెదళ్ళలో స్థిరపడిపోవడానికి కారణం ఏమిటి? దీనివల్ల ప్రయోజనం ఎవరికీ? అని ప్రశ్నించుకుంటే ప్రజలను అజ్ఞానంలో ఉంచి దోపిడీ చేయాలనుకునే పాలకవర్గాలు వీటిని

ప్రజలు నమ్మేలా చేయడమే కాదు, ఆ విషయంలో కృతకృత్యులయ్యారు. అందుకే కారల్‌మార్క్స్ "ఏ యుగంలో అయినా ప్రజల భావాలు పాలకవర్గం నేర్పే భావాలే" అన్నాడు.

ఇక మానవ స్వభావం గురించి మాట్లాడుకునే ముందు అసలు మనిషి అంటే ఎవరు? అనేది ముందుగా తెలుసుకోవాలి.

"తన అవసరాలతో బాటు ఇతరుల అవసరాలు తీర్చే వస్తువులను ఉత్పత్తి చేసే శ్రామిక వ్యక్తే మనిషి" అన్నాడు మార్క్స్. అంటే ఈ నిర్వచనం ప్రకారం ఏ శ్రమా చేయకుండా ఇతరుల శ్రమమీద బ్రతికే దోపిడీదారుడు మనిషి కాకుండా పోతాడు. మరి మార్క్స్ చెప్పిన లక్షణాలు గల మనిషి ఎక్కడ ఉంటాడు? వర్గాలు ఏర్పడక ముందూ, వర్గాలనేవి రద్దయిపోయిన తరువాత మాత్రమే ఉంటాడు. అంటే వర్గాలు ఏర్పడకముందు శ్రమ చేయని మనిషి ఉండడు. అలాగే వర్గాలు రద్దయి పోయాక కూడా శ్రమచేయని మనిషంటూ ఉండడన్నమాట. మార్క్స్ చెప్పింది అలాంటి మనిషి గురించే.

**ఇప్పుడు మానవ స్వభావం అంటే ఏమిటో చూద్దాం:**

మంచి, చెడ్డ, దయ, నీతి, అవినీతి వంటి లక్షణాలు కాదు మానవ స్వభావం అంటే. "నర జంతువుని ప్రత్యేక మానవుడిగా తీర్చిదిద్దిన లక్షణాలు. ఏ జంతువులోనూ లేని లక్షణాలతో కూడినది మానవ స్వభావం" అంటే సర్వసాధారణంగా మానవులందరిలోనూ ఉండే స్వభావం. దీన్నే 'సార్వత్రిక మానవ స్వభావం' అంటారు. కాబట్టి ఒక ప్రత్యేక వ్యక్తిలోనో, ఒక సమూహంలోనో, ఒక ప్రత్యేక కాలంలోనో ఉండేదాన్ని 'సార్వత్రిక మానవ స్వభావం' అనలేం. క్లుప్తంగా చెప్పాలంటే 'మనుషులందరికీ వర్తించే కొన్ని సామాన్య లక్షణాలతో కూడినది మానవ స్వభావం'. ఇప్పుడు ఆ సామాన్య లక్షణాలేమిటో ఒక్కొక్కటే చూద్దాం.

**మానవ స్వభావం చారిత్రకం:**

ఏ మనిషైనా ఒక చారిత్రక దశకు, ఒకానొక రకమైన ఉత్పత్తి సంబంధాలు గల వ్యవస్థకు చెందుతాడు. అంటే అన్ని కాలాల్లోనూ ఒకే రకంగా మానవ స్వభావం

ఉండదన్న మాట. బానిస సమాజంలో బానిస – యజమాని, భూస్వామ్య వ్యవస్థలో రైతుకూలీ – భూస్వామి, పెట్టుబడిదారీ వ్యవస్థలో కార్మికుడు – పెట్టుబడి దారుడు ఉంటారు. బానిస స్వభావం ఉన్నట్టు రైతు కూలీ స్వభావం ఉండదు. రైతు కూలీ స్వభావం ఉన్నట్టు కార్మికుడి స్వభావం ఉండదు. అంటే కాలం గడిచే కొద్దీ మారిన జీవన స్థితిగతులను బట్టి మనిషి స్వభావం మారుతూ ఉంటుంది.

**మానవ స్వభావం ప్రకృతితో ముడిపడి ఉంటుంది:**

అంటే మానవుడు ప్రకృతిలో జీవిస్తూనే దాని నుండి వేరుబడి దానిని మారుస్తాడు. ఈ విషయం అర్థం కావాలంటే జంతువూ మనిషి కార్యకలాపాల గురించి చూడాలి.

జంతువు తన ఉనికి కోసం ప్రకృతిలో మార్పులు చేస్తుంది. అంటే ప్రకృతిని ఉపయోగించుకోవడం మాత్రమే చేస్తుంది. అదే మనిషి అయితే ప్రకృతిలో మార్పులు చేసి దానిమీద ఆధిపత్యం సాధిస్తాడు. ఉదాహరణకు జంతువు తన ఆకలి తీర్చుకోడానికి చెట్లనూ పొదలనూ తినేస్తుంది. అంటే ప్రకృతిలో వాటిని లేకుండా చేస్తుంది. ఎంగెల్స్ 'ప్రకృతి – గతి తర్కం'లో "మేకలు గ్రీస్‌లో అడవులను పునరుజ్జీవనం లేకుండా చేసాయి' అంటాడు. కానీ మనిషి తన అవసరాల కోసం అడ్డుగా ఉన్న చెట్లనూ గుట్టలనూ కొండలనూ నిర్మూలించి ప్రాజెక్టులవంటివి నిర్మిస్తాడు. అంటే ప్రకృతి మీద ఆధిపత్యం సాధిస్తాడు. ఇదంతా శ్రమవల్లే సాధ్యమయ్యింది.

**చైతన్యంతో కూడిన జీవ కార్యకలాపం (life activity) మానవ స్వభావం :**

ఇది వివరంగా అర్థం కావాలంటే జంతు కార్యకలాపాన్నీ మానవ కార్యకలాపాన్నీ పోల్చి చూడాలి. ముందు జంతువు గురించి తెలుసుకుందాం. జంతువు తన అవసరం కోసమే పని చేస్తుంది. దానికి ఒక ప్రణాళిక ఉండదు. ఉదాహరణకు సాలెగూడు అల్లేటప్పుడు తేనెటీగలకూ మనసులో ఒక ప్రణాళిక అంటూ ఉండదు. ప్రకృతి సిద్ధమైన సహజాతం (instinct) తో పని చేసుకుంటూ పోతాయి. వేల సంవత్సరాలు గడిచినా ఆ నిర్మాణంలో మార్పు ఉండదు. ఇపుడు మనిషి గురించి చూద్దాం. మనిషి తనకు అవసరం లేనపుడు కూడా పనిచేస్తాడు. తను చేసే పనికి

మనసులో ఒక ప్రణాళిక ఉంటుంది. తను చేయాలనుకున్న వస్తువు మనసులో రూపుదిద్దుకుని ఉంటుంది. కాలం గడిచేకొద్దీ తన అభిరుచులకు తగినట్టు నిర్మాణంలో మార్పు ఉంటుంది. ఎప్పటికప్పుడు తన నైపుణ్యాన్ని జోడిస్తూ ఉంటాడు. ఆ విధంగా తనకు అవసరం లేనప్పుడు కూడా పనిచేయడం వల్లనే మెదడు, దానితోబాటు ఇతర అంగాలూ అభివృద్ధి చెందాయి. భాష పుట్టింది.

**శ్రమించడం మానవ స్వభావం:**

"శ్రమైక జీవన సౌందర్యానికి సమానమన్నది లేనేలేదు" అన్నాడు విప్లవకవి శ్రీశ్రీ. మానవుడు మానవుడిగా అవతరించడానికి కారణం శ్రమ. "మొత్తం ప్రపంచ చరిత్ర అంతా మానవ శ్రమ సృష్టించిందే కానీ అంతకు మించి ఏమీ కాదు" అన్నాడు మార్క్స్. మనం ఉపయోగించే కనీసావసర వస్తువు మొదలు మోడరన్ టెక్నాలజీ వరకూ అంతా మానవ శ్రమే. ఫలానా అధునాతన వస్తువు ఫలానా వ్యక్తి రూపొందించాడని అంటూ ఉంటారు. కానీ సదరు వ్యక్తి చేసిన వస్తువు వెనుక వేలాది శ్రామికుల శ్రమ దాగి ఉంది. ఆ శ్రామికులు చేసిన ఉపకరణాలు లేకపోతే ఈయన వస్తువే తయారై ఉండేది కాదు. కాబట్టి శ్రమ చేయడం మానవ స్వభావం.

మానవుడు సోమరి. ఎప్పుడూ విశ్రాంతి కోరుకుంటాడు. అనేది నిర్విరామంగా పనిచేయాల్సి రావడం, విపరీతమైన శ్రమదోపిడీ, అణచివేతల కాలం నాటి మాట. అసలు ఫ్యాక్టరీలలో సూపర్వైజర్ అవసరం ఎందుకొస్తుంది? తగిన విశ్రాంతి, స్వేచ్ఛాపూరిత వాతావరణంలో కార్మికులు పనిచేసే చోట సూపర్వైజర్ల అవసరమే ఉండదు. కాబట్టి మానసికమైనదో శారీరకమైనదో ఏదో ఒక శ్రమ చేయడం మానవ స్వభావం.

**జాతి అస్తిత్వం మానవ స్వభావం:**

తను ఏ జాతికి చెందుతాడో ఆ జాతి స్వభావాన్ని కలిగి ఉండటమే జాతి అస్తిత్వం. చూడటం, వినడం, రుచి చూడటం లాంటివి జంతువులు కూడా చేస్తాయి. కానీ మనిషికి అదనంగా ఆలోచన, ప్రేమించే స్వభావం వంటివి కూడా ఉంటాయి. ఇవే జాతి అస్తిత్వం అంటే. వీటివల్లే సామాజిక సంబంధాలూ, భాష అభివృద్ధి

చెందాయి. అన్నింటికంటే ముఖ్యంగా పనిచేసే స్వభావం ఉంటుంది. భూమి దున్నడం, కుండలు వంటి వస్తువులు తయారుచేయడం చేస్తాడు. ఇలాంటి శక్తులతో ప్రకృతితోనూ ఇతరులతోనూ సంబంధాన్ని ఏర్పరచుకుంటాడు.

**స్వీయ వ్యక్తీకరణ మానవ స్వభావం:**

ఒక ఉదాహరణ ద్వారా ఇది అర్థమవుతుంది. శ్రామికుడు ఒక చెక్కతో బల్ల తయారుచేస్తాడు. ఆ చెక్క ప్రకృతి. అది బల్ల కాదు. కానీ అది బల్లగా మారడానికి తన శారీరక, మానసిక శక్తులను బల్ల రూపంలో వ్యక్తం చేశాడు. ఇదే స్వీయ వ్యక్తీకరణ. ఇక్కడ బల్ల తన అవసరం కోసమో ఇతరుల అవసరం కోసమో తయారుచేయడంలో తనకు స్వేచ్ఛ ఉంటుంది. కానీ పెట్టుబడిదారీ వ్యవస్థలో కార్మికుడికి ఆ స్వేచ్ఛ ఉండదు. ఇక్కడ స్వేచ్ఛ అంటే ఆవశ్యకత వలన గానీ, కుటుంబ పరిస్థితుల వల్ల గానీ విధిగా చేయాల్సి రావడం వల్ల గానీ పని చేయవలసిన అవసరం లేకపోవడమే స్వేచ్ఛ.

**సామాజిక స్వభావం మానవుడి లక్షణం:**

మానవుడు ఎక్కడో సమాజానికి దూరంగా ఉండి ఉత్పత్తి చేయలేడు. అతనికి పనిచేయడానికి పనిముట్లు కావాలి. వాటిని అందకుముందే ఎవరో చేసి ఉండాలి. భాష పుట్టాలంటే సామాజిక స్వభావం ఎలా అవసరమో ఉత్పత్తికి కూడా సామాజిక స్వభావం అవసరం.

కాబట్టి ఒకే వాక్యంలో చెప్పాలంటే మానవ స్వభావం చారిత్రకం, చైతన్యంతో కూడిన కార్యకలాపం, జాతి అస్తిత్వం, స్వేచ్ఛాయుత కార్యకలాపం, శ్రమద్వారా స్వీయ వ్యక్తీకరణ, సామాజిక అస్తిత్వం అని చెప్పుకోవాలి.

పరాయీకరణ వల్ల మానవ స్వభావానికి కలిగే నష్టంలో ముఖ్యమైన విషయాలు మూడు చూద్దాం. మొదటిది చైతన్యంతో కూడిన కార్యకలాపానికి అవకాశం ఉండదు. అంటే కేవలం ఒక వస్తువులో ఒక భాగాన్ని మాత్రమే (గుడ్డని చొక్కాగా కత్తిరించడమో, కుట్టడమో, బొత్తాలు కుట్టడమో, కాజాలు చేతికుట్లో వేయడమో వంటివి) చేయడం వల్ల అతని మానసిక శక్తుల, అభిరుచుల, నైపుణ్యాల వినియోగానికి అవకాశం ఉండదు. చార్లీ చాప్లిన్ మోడరన్ టైమ్స్ సినిమా దీనికి

మంచి ఉదాహరణ. అందులో కార్మికుడు ఫ్యాక్టరీలో నిర్విరామంగా రెండు చేతులతోనూ రెండు రెంచ్‌లు (spanners) పట్టుకుని బోల్ట్‌లు బిగించే డ్యూటీ చేస్తుంటాడు. నిరవధికంగా చేసిన ఆ పనివల్ల అతను డ్యూటీ దిగిన తరువాత కూడా రెండు చేతులూ బోల్ట్‌లు బిగిస్తున్నట్టుగా ఆ మూస పద్ధతిలో కదులుతూనే ఉంటాయి. రెండోది పూర్వం వడ్రంగి, టైలర్ వంటి వృత్తి పనివారు తమ శ్రమతో రూపు దిద్దుకున్న వస్తువులను తృప్తిగా చూసుకునేవారు. ఇపుడు వస్తువులో ఏదో ఒక భాగాన్ని మాత్రమే తయారుచేసిన శ్రామికుడికి అటువంటి తృప్తి దొరకదు. మూడోది మానవుడికి పనితోబాటు అన్ని రకాల కార్యకలాపాలూ అంటే ఆటపాటలూ, విశ్రాంతి కావాలి. పరాయీకరణ కారణం వల్ల కార్మికుడికి ఇవేమీ ఉండవు.

పరాయీకరణపై తప్పనిసరిగా పోరాడాలి. కానీ అంతకంటే ముందు పరాయీకరణకు గురికాకుండా మనల్ని మనం కాపాడుకోవాలంటే దీని గురించి తెలుసుకోవాలి.



## 2

# పరాయీకరణ – ప్రపంచీకరణ – సాహిత్యం

– **గ.నా.రా.**, సాహితీ స్రవంతి, రాష్ట్ర ఉపాధ్యక్షులు,
సెల్ : 9949228298

పతంజలి నవల 'పొద్దు తిరుగుడు పువ్వు'లో మెజిస్ట్రేటు "భూమి బల్లపరుపుగానే ఉంద"ని తీర్పు చెబుతూ, "తన కోసమే అనే అలికిడి కుక్కకుంది కానీ మనిషికి లేదు" అంటాడు.

అలా మనిషి మనిషి కాకుండా పోవడమే పరాయీకరణ.

ఇటీవలి కాలంలో మనకు ఎక్కువగా ఈ 'పరాయీకరణ' అనే పదం వినిపిస్తోంది. ముఖ్యంగా రావు కృష్ణారావుగారు తన 'ఎలియనేషన్' రచనతో మన వీపుల మీద కలంతో చరిచినట్లు అనిపించింది.

సమకాలీన సమస్యల్ని భౌతికవాద దృక్పథంతో అధ్యయనం, విశ్లేషణ చేయాల్సి ఉందన్న మార్క్సిస్టు మేధావులు, సిద్ధాంతకర్తలు మళ్ళీ ఒకసారి పేజీలు తిరగవేసే పనిలో పడ్డారు.

90వ దశకంలో గాట్, డంకల్ ఒప్పందాలు జరిగాక ప్రపంచీకరణ వేగం పుంజుకుని ఒక్క భారతదేశంలోనే కాక ప్రపంచవ్యాప్తంగా పెను ప్రభావాన్ని చూపించడం ప్రారంభించింది.

ప్రపంచీకరణ జడిలో సగటు మనిషి బతుకు పరాయిదైపోయింది. సాహిత్యంలో సైతం ఈ పరిణామాల్ని చిత్రించడం జరిగింది.

కొలంబస్ కాలంలోనే వృద్ధి చెందిన ప్రపంచీకరణని కేవలం ఆర్థిక పరమైనదిగా భావించడం సరికాదు. అది సాంస్కృతికమయిన దాడి కూడా అని అర్థం చేసుకోవాలి.

అమెరికాలోని రెడ్ ఇండియన్లను, వారి ఆచారాల్ని, భాషను, సంస్కృతిని సమూలంగా నాశనం చేయడం వెనుక వొక్క ఆర్థిక రాజకీయ ప్రయోజనాలు మాత్రమే కాదు, సామాజిక, సాంస్కృతిక ఆధిపత్య భావజాలం కూడా ఉంటుంది.

సాహిత్యంలో ఈ ప్రపంచీకరణ ప్రమాదంతో పాటూ పరాయీకరణ ప్రభావాన్ని చిత్రించిన సంఘటనలు ఉన్నాయి.

"దేశమంటే మనుషులోయ్" అని మహాకవి గురజాడ అన్నది పరాధీనతలో మగ్గే పౌరుల్ని గురించి కాదు, నవయుగాన్ని స్వప్నించిన యుగకర్తలయిన చైతన్యశీలురయిన మానవుల గురించే.

చింతనాత్మక మానవుడు ప్రశ్నకి ప్రతిరూపం. అతడు అసమానతల్ని భరించలేడు. ఆర్థిక దోపిడీని తట్టుకోలేడు. కనుకనే, చెరబండరాజు "శ్రమ ఎవడిదిరో, సిరి ఎవడిదిరా?" అని ప్రశ్నిస్తాడు.

"No man touched the seed, or lusted for the growth. Men ate what they had not raised, had no connection with the bread. The land bore under iron, and under iron gradually died; for it was not loved or hated, it had no prayers or curses." అంటూ, విస్మయపరిచే ప్రపంచీకరణ క్రమానికి బలైపోయే మానవుల మనోభావాల్ని జాన్ స్టీన్‌బెక్ గొప్పగా చిత్రించాడు The Grapes of Wrath నవలలో.

కల్తీ విత్తనాలు, ఎరువులు, అధిక వడ్డీ వ్యాపారంతో కుదేలైన రైతు అన్నీ కోల్పోయి కార్పోరేట్ మాయాజాలంలో పడి జీవితాన్నే పరాయీకరించుకుంటాడు. ఒక్క రైతనే కాదు, నేటి వ్యవస్థలో అందరం పరాయిగా మనది కాని బతుకుని మరొకరి లాభాల కోసం బతుకుతున్నవాళ్ళమే.

"తన శ్రమ ప్రజలకు సంతోషాన్ని ఇస్తుందన్న నమ్మకం ప్రతి వ్యక్తికీ ఉండాలి. అలా కాకుండా పనిచేసేది డబ్బుకోసమే అయితే, ఇవాళ తవ్వు, రేపు పూడ్చు ఐతే అది నీకు ఆనందాన్ని ఇవ్వదు, ప్రజలకు సంతోషాన్ని ఇవ్వదు" అంటాడు యోగార్ 'హంసలను వేటాడొద్దు' అనే 'బోరిస్ వాసిల్యేవ్' నవలలో.

అలాంటి యాంత్రిక వ్యవస్థలో మనిషి, చింతనాత్మక వికాసానికి అవకాశం ఎక్కడ ఉంటుంది? అందుకే "our dangers are war and robotism.." అన్నాడు ఎరిక్ ఫ్రామ్ తన ప్రసిద్ధ రచన The Sane Society లో.

అటువంటి Robotism కి విరుద్ధంగా Humanism కోసం నిబద్ధతగా జరిగే ప్రయత్నాల వల్లనే పరాయీకరణని అధిగమించడం సాధ్యం అవుతుంది.

పరాయీకరణ ఇంకా స్పష్టంగా అర్థం కావాలంటే ప్రపంచీకరణని బాగా లోతుగా అధ్యయనం చేయాలి. ఈ రెంటికీ అవినాభావ సంబంధం ఉంది. ప్రపంచీకరణ అంటే ఏంటి అనే ప్రశ్నకు కవి ఎండ్లూరి సుధాకర్ కవితాత్మకంగా జవాబు చెప్తూ,

**"నిండు గోదారి పక్కన నీళ్ళ పొట్లాలమ్ముకుంటున్న**
**పసిబాలుడ్ని చూపాను,**
**కొబ్బరి బోండాలమ్ముకుంటూ కోకోకోలా తాగుతున్న**
**కోనసీమ కొబ్బరి వ్యాపారిని చూపించాను,**
**పెరుగు, పాలు అమ్మాక పెప్సీనే సేవిస్తూ**
**సెల్ మాట్లాడుతున్న చల్లనమ్మని చూపించాను".** అంటారు.

బుచ్చిబాబు 'చివరికి మిగిలేది' నుండి ఐయన్‌రాండ్ ఫౌంటెన్ హెడ్ దాకా పరాయీకరణ ఛాయలు చూపించొచ్చు కానీ ఆచరణలో ఆ అవగాహనను ఎలా కాపాడుకోగలమన్నదే మనముందున్న ప్రశ్న.

దశాబ్దాలుగా రాయలసీమ, తెలంగాణ, ఉత్తరాంధ్ర తదితర సాహిత్యాలలో భిన్న ప్రక్రియల్లో ఈ ప్రపంచీకరణకి, పరాయీకరణకి వ్యతిరేకంగా రాసిన, రాస్తున్న

వాళ్ళు అనేకమంది ఉన్నారు. ఐతే, మరింత లోతుగా ఈ అంశాలపై రాయాల్సిన, ఇంకా చర్చించాల్సిన అవసరం ఎప్పటికంటే ఈరోజు ఎక్కువుంది.

"వ్యక్తులు వారి జీవితాన్ని ఎలా వ్యక్తం చేస్తారో అలాగే ఉంటారు, వారు చేసిన ఉత్పత్తిలోనే వారు వ్యక్తం అవుతారు" అంటారు మార్క్స్ ఏంగెల్స్ వారి 'జర్మన్ ఐడియాలజీ' గ్రంథంలో. కాబట్టి వ్యక్తులు ఎలా ఉంటారనేది ఆయా వ్యవస్థ భౌతిక ఉత్పత్తి స్థితిగతుల పైనే ఆధారపడి ఉంటుంది. ఆ భౌతిక పరిస్థితుల్లో మార్పు రానిదే వ్యక్తులూ, వారి జీవితాలు మారవు.

"మనది నర+సింహ సభ్యత! నర+సింహ సంస్కృతి! సమాజంలోని తొంభై శాతం మానవులకు ఈ సభ్యత, ఈ సంస్కృతి మానవ రక్తం రుచిమరిగిన క్రూర జంతువు (సింహం) లాంటిది! నిరంతరమూ శ్రమించే మానవుల్ని కూటికీ గుడ్డకూ దూరం చేస్తుంది. రాత్రింబవళ్ళు శ్రమించి చెమటోడ్చి దేశ సౌభాగ్యాన్ని పెంచి, మనకింత కూడు పెట్టే మానవుల్ని అంటరానివార్ని చేసి ఊరి బయటకు తరిమేస్తుంది!...." అంటారు ఆలూరి భుజంగరావుగారు తన ఆత్మకథ 'గమనాగమనం'లో.

మానవాళి ఉత్పత్తి సంబంధాల్ని, భౌతిక పరిస్థితులని మార్చాలంటే శక్తివంతమయిన 'భావజాలం' అవసరం. అది సాహిత్యం ద్వారా వివిధ ప్రక్రియలలో సృజనాత్మకంగా విరివిగా ఉత్పత్తి కావాలి. అలాంటి ప్రత్యామ్నాయ సాహిత్యమే ప్రజలకి ప్రాతినిధ్యం వహించి పరాయీకరణ గుట్టువిప్పి గూడుపుఠాణీని బయటపెట్టగలదు. అదే ఈనాటి సాహిత్యం కర్తవ్యం.

❊ ❊ ❊ ❊ ❊

3

# పరాయీకరణ పరాకాష్ట – కులం

– **బత్తుల సిద్ధు**, పి.డి.యస్.యు,
తూ.గో.జిల్లా అధ్యక్షులు, సెల్ : 9603764003

మార్క్సిజం వెలుగులో పరాయీకరణని తెలుగులో పరిచయం చేయడానికి 'ఎలియనేషన్' పుస్తకం రచించిన రావు కృష్ణారావుగారు ప్రకృతి నుండి, సమాజం నుండి, మతం నుండి, రాజకీయాల నుండి, జాతి నుండి, శ్రమ విభజన నుండి, డబ్బు నుండి, సరుకుల నుండి, భావ జాలం నుండి మానవ సమాజం ఎలా పరాయీకరణకి గురైందో దానిని నేటి పరిస్థితులకు తగ్గట్టుగా వివరించారు కానీ, హిందూ వర్ణవ్యవస్థలో కులం కారణంగా 3 వేల సంవత్సరాల నుండి భారత సమాజం ఎలా 3 వేల కులాలు, లెక్కలేనన్ని ఉపకులాలు, అనేక మంది దేవుళ్ళు – దేవతల వల్ల ఎలా పరాయీకరణకి గురైందో ఆ క్రమాన్ని రాయడంలో, వివరించడంలో రచయిత ఎందుకనో వెనకబడ్డారని అనిపించింది.

భారతీయ సామాజిక పరిణామంలో అత్యధిక శాతం అనేక శతాబ్దాలుగా అగ్రవర్ణాల చేతుల్లో 'పరాయీకరణ'కి గురవుతున్న అణగారిన కులాల ప్రజలు నిత్యం ఎదుర్కొంటున్న సమస్యలు, ఇబ్బందులను, అందులో లోతుగా ఇమిడి ఉన్న కులం పాత్రను ఆయన రాయలేకపోయారు. కులం ఈ దేశపు క్రూర వాస్తవం. హిందూ సమాజం శూద్రులు, అతిశూద్రుల పట్ల నిర్లజ్జగా ప్రదర్శించిన వివక్ష, అవమానాలకు అంతే లేదు. దేశంలో లక్షలాదిమంది బహుజనుల్ని ఈ వ్యవస్థ బానిసలుగా చూసింది. 'అంటరానితనం' అనే సామాజిక అమానవీయ నేరాన్ని హిందూ సామాజిక వ్యవస్థ అట్టడుగు వర్గాల మీద అత్యంత దుర్మార్గంగా అమలు చేసింది.

మూతికి ముంత, ముడ్డికి చీపురు కట్టుకు నడిచి సాటివారి చేతనే జీవచ్ఛవాలుగా చూడబడిన క్రింది కులాలకి తెల్సినంతగా పెత్తనం, ఆధిపత్యాల గురించి ఇంకెవరికి తెలుస్తుంది? అడుగడుగునా అవమానాలు, చీత్కారాల్ని చవిచూసిన అణగారిన జనాలకంటే ఆత్మగౌరవం విలువ వేరెవరికైనా ఎలా తెలుస్తుంది? ఈరోజుకీ ప్రతీనిత్యం మనకి ఎదురయ్యే ప్రశ్న, 'మీరెవరు?' అనేదే! అందుకే నేటికీ బహుజన కులాల వారికి పెద్ద కులాల యిళ్ళల్లోకి ప్రవేశం లేదు. అడపాదడపా జరిగే ఆదర్శ వివాహాల సంగతి సరేకాని హిందూ వ్యవస్థలో కులాంతర వివాహాలు చెప్పుకోదగ్గన్ని జరగవు. ఈ దేశంలో దళిత బహుజనులపై జరిగిన, జరుగుతున్న అఘాయిత్యాల గురించి ప్రస్తావించకుండా 'పరాయీకరణ' అంశం సమగ్రం కానేరదు.

సంత్ రవిదాస్ మొదలుకుని భగవాన్ దాస్ దాకా, మహాత్మా ఫూలే నుండి మహనీయుడయిన అంబేద్కర్ వరకూ హిందూ సామాజిక చట్రం నిర్మించిన అసమానతల్ని ఎదుర్కోక తప్పింది కాదు. గ్రామాలకి దూరంగా వెలివేయడం, నిత్య జీవనానికి అవసరమయిన తాగునీరు – సాగునీరు నిషేధించడం, ఆయుధాలు ధరించడాన్ని, ఆభరణాలు ధరించడాన్ని నిషేధించడం, బట్టలుతకడాన్ని – క్షవరం చేయడాన్ని నిషేధించడం, చివరికి నచ్చిన ఆహారాన్ని తినడాన్ని, నచ్చిన ఆహార్యంగా మంచి బట్టలు కట్టుకోడాన్నీ కూడా నిషేధించిన ప్రపంచంలోనే అత్యంత హేయమయిన దుర్మార్గమయిన విధానాన్ని దళితుల పట్ల హిందూ సమాజం ప్రదర్శించింది.

భారత సమాజాన్ని సామాజికంగా కులం పరాయీకరణకు గురిచేసింది. అలాంటి కులాన్ని మానవ సామాజిక చరిత్రలో అతిపెద్ద నేరంగా కాక, పాటిస్తున్న వాళ్ళని నేరస్తులుగా కాకుండా సామాజిక హోదాకి ఒక చిహ్నంగా గుర్తించే దౌర్భాగ్యం ఈనాటికీ అమలవుతోంది. అందుకే మానవజాతి సాంస్కృతిక పరిణామంలో భాగంగా 'కులం' పరాయీకరణ పనిముట్టుగా ఈ దేశంలో నిర్వహించిన విధ్వంసక పాత్రపై లోతైన అధ్యయనం, పరిశోధన జరగాల్సిన అవసరం ఎంతైనా ఉంది. వేల సంవత్సరాలుగా బ్రాహ్మణీయ ఆధిపత్యాన్ని కొనసాగిస్తున్న 'కులం' వినాశకర ప్రారంభం, పరిణామాల్ని మొదటిసారిగా 1916లో 'ఆరిజన్ ఆఫ్ క్యాస్ట్' (కులం మూలాలు) సిద్ధాంతీకరించిన అంబేద్కర్ ఒక రకంగా కులం నిర్వహించే 'పరాయీకరణ' పాత్రను గుర్తించి, వివరించాడనవచ్చు.

అసమానతలకి ఆయువుపట్టుగా 'కులం' నిర్వహించే బహుముఖమైన 'పరాయీకరణ'ని అర్థం చేసుకోబట్టే అంబేద్కర్, *"నీవు ఏ దిక్కుకు తిరిగినా సరే, దారికడ్డంగా నిలబడే పెనుభూతం కులవ్యవస్థ. ఈ భూతాన్ని చంపి పారవేస్తే తప్పా నీవు రాజకీయ సంస్కరణగానీ, ఆర్థిక సంస్కరణగానీ, సాధించలేవు"* అంటాడు. అంతేకాదు, హిందువులలోని వివిధ కులాల ప్రజలను కులవ్యవస్థకు వ్యతిరేకంగా ప్రేరేపించడానికి, కార్ల్‌మార్క్స్ చెప్పిన "మీరు పోగొట్టుకునేదేమీ లేదు, మీ సంకెళ్ళు తప్ప" అనే నినాదం ఇక్కడ ఎందుకు పనికిరాదో కూడా అంబేద్కర్ తన "కుల నిర్మూలన"లో చర్చించాడు.

*"... ఈ కులాలన్నింటికీ దేనికి దానికే కొద్దో గొప్పో కొన్ని కొన్ని ఆధిక్యతలు ఉండేటట్టు ఏర్పాటు కావడం వలన మొత్తం కులవ్యవస్థ రద్దయితే తమ స్వాతిశయాలు పోగలవనే భయం ప్రతి కులానికీ ఉంది. ఇంతేకాక, ఒక కులానికి మరొక కులం మీద ఉన్న ప్రభావాలు, ప్రతిష్టలు పోతాయనే భీతి కూడా ఉంది. ఈ విషయాల్లో ఒక కులం కంటే మరొక కులం ఎక్కువ పోగొట్టుకునే వీలు ఉన్నందువల్ల, ఈ కులాలు నిత్యమూ మాత్సర్యంతో మ్రగ్గుతూ ఉన్నందువల్ల మార్క్స్ మహాశయుడు శ్రామికజనంలో ఆశించే ఐకమత్యం హిందువులలో మృగ్యం కాగా, కులవ్యవస్థను ఎదిరించడానికి హిందువులను ఒక సంఘటిత శక్తిగా సమీకరించడం మీకు సాధ్యం కాదు"* అంటూ స్పష్టంగా చెబుతాడు అంబేద్కర్.

కాబట్టి ఈ దేశంలోని ప్రజలు ఎలా పరాయీకరించబడుతున్నారో విశ్లేషించే ముందు కులాన్ని, కుల అసమానతల్ని మతాన్ని, శాస్త్రాలు, ప్రచారాలు, సంప్రదాయాల పేరిట సాగే, బ్రాహ్మణీయ ఆధిక్యతల్ని బలమైన పరాయీకరణ సాధనాలుగా గుర్తించాల్సి ఉందనేది నా అభిప్రాయం. కులవ్యవస్థను ఈనాటికీ సజీవంగా కాపాడుతున్న మతాచారాలు, బ్రాహ్మణీయ సంస్కృతి, కట్టుబాట్లు మొదలయిన వాటిని ఎదుర్కొనే ప్రయత్నం చేయడంతోనే కులాధిపత్యానికీ, పరాయీకరణకీ వ్యతిరేకంగా జరిగే పోరాటం ఇమిడి ఉంటుంది. నిచ్చెనమెట్ల కులవ్యవస్థ మూలాల్ని పెకలించి కులనిర్మూలన దిశగా అడుగులేయకుండా భారతదేశ ముఖచిత్రాన్ని సంపూర్ణ ప్రజాస్వామ్య శిల్పంగా మలిచే ప్రక్రియ పూర్తి కాదు. పరాయీకరణని అధిగమించే కార్యక్రమం కూడా దీంతోనే తప్పనిసరిగా ముడిపడి ఉందనేది నా అభిప్రాయం.



# 4

# పరాయీకరణ – లైంగికత

– **గౌరవ్ కళ్యాణి,** సామాజిక కార్యకర్త, సెల్ : 9032094492

పుట్టుకతోనే బిడ్డ అంగం ఆధారంగా లింగాన్ని నిర్ణయించడమనే ఆధిపత్య వ్యవస్థలో మనమున్నాం. ఒక వ్యక్తి లైంగికత స్వేచ్ఛాయుతమయిన అభివ్యక్తిగా గుర్తించకపోగా, సమాజం (వైద్యులు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు) నిర్దేశించినదే వ్యక్తి లైంగికతగా చెలామణీ అవుతోంది. ఈ క్రమంలో 'భిన్న లైంగికత'ని అసలు ఒక హక్కుగా గుర్తించడం ఒక భాగమైతే, 'స్త్రీ–పురుష' మూసలో కొనసాగుతున్న పురుషాధిక్య వ్యవస్థలో సైతం మనుషుల 'లైంగికత' ఎట్లా పరాయీకరణ చెందుతోందనేదో ఆసక్తికర విషయం.

మనిషికి ఎంత చరిత్ర ఉన్నదో లైంగికతకి దాదాపు అంతే చరిత్ర ఉంది. జీవ పరిణామ క్రమంలో స్త్రీ–పురుషులు భిన్న లింగాలుగా రూపాంతరం చెందిన నాటి నుండి మనిషి లైంగికత ప్రకృతితో ముడిపడి వుంది. శారీరకమయిన సుఖవాంఛల్ని తీర్చుకోవడమే ప్రధానంగా మొదలైన లైంగిక చర్య పునరుత్పత్తి సాధనంగా, మానసికంగా ఉల్లాసంగా, పవిత్ర దైవకార్యంగా ఇలా భిన్న దశల్లో రూపాంతరం చెందింది. మాతృస్వామ్య వ్యవస్థలో సుస్థిరమైన స్వభావం కలిగిన లైంగికత తదనంతరం ఆధిపత్య రూపం తీసుకుని స్త్రీ అణిచివేతకి కారకమయింది.

పారిశ్రామికరణ ప్రభావంతో భూస్వామ్య ఫ్యూడల్ సమాజాల్లో పెనుమార్పులు వచ్చాయి. పురుషాధిక్యతకి ఆధునికత తోడై 'స్త్రీ' అనే సహజ వ్యక్తిత్వాన్ని పూర్తిగా పరాయీకరించడం జరిగింది. పెట్టుబడిదారీ సమాజంలో 'స్త్రీ–పురుష' భిన్నత్వాన్ని కొనసాగించడం పెట్టుబడిదారుడికి అవసరం. స్త్రీ–పురుషులు–ఇతరులు ఎలా ఉండాలో,

ఎలా పెరగాలో, ఏ విధంగా ప్రవర్తించాలో వ్యవస్థ ముందే నిర్దేశించి ఉంచుతుంది. రంగు, ఎత్తు, లావు, తదితర శారీరక కొలతల ఆధారంగా 'అందం' అనే భావనని లైంగికతకి ముడిపెడుతుంది.

అలా 'మనుషుల్ని' స్త్రీలుగా, పురుషులుగా 'ఉంచడంలో' కార్పోరేట్ ఉత్పత్తులు ప్రధానపాత్ర పోషిస్తాయి. స్త్రీ-పురుషులకి వేర్వేరు కార్యక్రమాలని రూపొందించి, ఆధిపత్య కుటుంబాల్ని జాగ్రత్తగా కాపాడటం కంపెనీల లక్ష్యం. ఎందుకనేది స్పష్టం. స్వేచ్ఛ, సమానత్వం, స్వాభిమానం అనే భావనలు ప్రస్తుత కుటుంబ వ్యవస్థలో తలెత్తకుండా, ప్రేమ, పెళ్లి, సంతానం, లక్ష్యాలు అనే వాటి చుట్టూతా మనుషుల్ని తిప్పడం ఊరికే కాదు. నిజానికి ఈ లక్ష్యాలన్నీ కార్పోరేట్‌లవే కాని ప్రజలవి కాదు. 'ప్రజలు' ఎల్లప్పుడూ 'స్త్రీ-పురుషులుగా' ఉన్నప్పుడే వాళ్ళు 'లైంగికత'ని కొనసాగించే 'వినియోగదారులు'గా ఉంటారు. ప్రకృతి సహజమైన లైంగికతకి దూరం కాబడి పెట్టుబడిదారీ లైంగికత'ని మోస్తారు. తమ సొంత లైంగికత నుండి పరాయీకరించ బడతారు.

'స్త్రీత్వం', 'పురుషత్వం' అంటూ కొన్ని స్వభావాల్ని ప్రసారమాధ్యమాలు, కుటుంబాల ద్వారా సమాజంపై రుద్దే విధానాన్ని ఆధిపత్య శక్తులు పాటిస్తాయి. శారీరకంగా ఆయా లక్షణాలే లైంగికతకి ముఖ్యమని నమ్మించే లోకం వాటిని 'పెంపొందించుకోవడం' ఆ 'అవయవాలు', 'వాంఛలు' అలాగే కలిగి ఉండటం 'మాత్రమే' సహజమనే భావన కలిగిస్తుంది. పొడగైన జుట్టు, ఎత్తైన ఛాతీ, సన్నని నడుము మృధుత్వం లాంటివి స్త్రీ లక్షణాలుగానూ కండలు తిరిగిన దేహం, మోటుదనం, ధైర్యం వంటివి పురుష గుణాలుగా ప్రచారం చేస్తుంటుంది.

స్త్రీ పురుషులు ముఖ్యంగా యువత ఈ లక్షణాల్ని పెంపొందించుకోడానికే చాలా వ్యాయామం చేస్తుంటారు. ఈ లక్షణాలు పెంచడానికి తోడ్పడే 'సౌందర్య సాధక ఉత్పత్తులు', 'వినియోగ సేవల' వ్యాపారం అత్యధికంగా జరుగుతుంది. మరోవైపు ఈ తతంగ లక్ష్యం 'జీవిత భాగస్వామిని' లేదా మరో రకంగా చెప్పాలంటే 'లైంగిక భాగస్వామిని' పొందడమే లక్ష్యమనే విధంగా 'ప్రచారం' సాగుతుంది. మనిషికి సహజసిద్ధంగా తలెత్తాల్సిన 'లైంగిక వాంఛ' అనే ఒక చర్య చుట్టూతా లక్షల కోట్ల వ్యాపార సామ్రాజ్యాన్ని విస్తరింపజేసి, స్త్రీ పురుష సమాగమాన్ని వాణిజ్యభరితం

చేసి కుల, మత, వర్గ, ప్రాంత, లింగ బేధాల్ని అందులో ఇమిడ్చి అద్భుతమైన ప్రేమమయ లైంగిక భావనని అమానవీయమైన ఆధిపత్య రూపకంగా మల్చింది ఈ పెట్టుబడిదారీ వ్యవస్థ.

అందుకే వ్యక్తి ఆధీనంలో ఉండాల్సిన 'లైంగికత'ని వర్గం స్వాధీనం చేసుకుంది. స్త్రీగానో, పురుషుడిగానో తప్ప ఉండలేని స్థితి కల్పించింది. స్త్రీ శరీరాన్ని పురుషుడి వాంఛ కోసమే జనించిన 'సరుకు'గా మార్చడంలో మధ్యయుగాల్లోమతం లానే పెట్టుబడిదారీ సమాజం విజయం సాధించింది. ఒకవైపు లింగ సమానతకి సంబంధించిన ప్రచారం తన లాభార్జనకి పనికి వచ్చేంత మేరకు చేసే కార్పోరేట్ లోకం, అడుగడుగునా 'స్త్రీ' దేహాన్ని వ్యాపార ఎత్తుగడగా మల్చుకునేందుకు సిగ్గుపడదు.

గుప్పెడుమంది ధనవంతుల కోసం వారికి భావి వినియోగదారుల్ని ప్రసాదించడం కోసం ప్రపంచంలో అనేక దేశాలు అన్ని అంశాలు అంటే, విద్య, ఉద్యోగం, ఉపాధి లాగానే ఈ పెళ్ళి, కుటుంబం, సంసారం, పిల్లలు అనే చట్రాన్ని పెంచి పోషిస్తున్నారనిపిస్తుంది. సమాజంలో చూస్తే పిల్లలంతా ఒక్కలానే స్త్రీ–పురుష' ముద్రలు ధరించి పుడుతున్నారు. వాళ్ళ చదువులన్నీ దాదాపు ఒక్కలాగే సాగుతాయి. ఒక రకమైన క్రమశిక్షణకు లోబడి ఉదయాన్నే బస్సుల్లో బయలుదేరి వెళ్ళే విద్యార్థులు అంతా ఈ చట్రంలో బానిసలే.

ఉద్యోగులని చూడండి. ఉదయాన్నే అలాంటి క్రమశిక్షణతోనే అవే బస్సుల్లో లేదా వాహనాల్లో ప్రయాణిస్తుంటారు. చిన్నచిన్న వ్యాపారస్తులు, రైతులు, స్త్రీలు, పురుషులు, ఇతరులు, పిల్లలు, వృద్ధులు అంతా అపారమైన ఒక అదృశ్య కుట్రలో వారి ప్రమేయం ఏమీ లేకుండానే భాగస్వాములౌతున్నారు. అదే పరాయీకరణ. మనిషి తన జీవితాన్ని జీవించలేకపోవడం. జీవించడంలోని ఆనందాన్ని ఆస్వాదించలేకపోవడం. సమిష్టితనంలోని సంతోషానికీ, వ్యక్తిత్వంలోని సంవేదనలకీ నడుమ అర్థంకాని ఒక అసంతృప్తితో వ్యర్థ ప్రయాసలతో నిరర్ధకంగా బతుకీడ్చడం.

మానవాళి పరాయీకరణ నుండి విడివడి పెట్టుబడిదారీ వ్యవస్థపై చేసే తిరుగుబాటంటూ ప్రత్యేకంగా ఏదీ ఉండదు. మనిషి 'లైంగికత'ని కూడా క్రమబద్ధీకరించుకోవడం ఇందులో భాగమే. ప్రేమ, పెళ్ళి, పిల్లలనే భావనలను మానవాళి తనకి తానుగా స్వతంత్రంగా తీసుకునే నిర్ణయాధికారంలో ఆనందకర

అనుబంధాలుగా కాక, ఒకానొక చారిత్రక క్రమంలో రుద్దబడిన అధిగమించరాని వ్యవస్థీకృత బంధనాలుగా ఉంచుకోరాదనేది భవిష్యత్తు మానవుడు నిర్దేశించుకునేదే హేతుబద్ధ సమాజ స్వరూపం కాగలదు.

సామాజిక పరాయీకరణని గుర్తించడం, దానికోసం మాట్లాడటం సులభం. కానీ, వ్యక్తిగత జీవితంలో లైంగిక పరాయీకరణని గుర్తించినప్పటికీ ఆచరణలో అందుకు వ్యతిరేకంగా ప్రవర్తించడం కష్టం. ఎందుకనేది స్పష్టమే. బహిరంగ వేదికల మీదా, సాహిత్యంలోనూ పుంఖానుపుంఖాలుగా వ్యక్తీకరించే అభిప్రాయాలకీ, సొంతింట్లో నుంచి 'సమానత్వాన్ని' ఒక ప్రజాతంత్ర విలువగా పాటించడానికీ వ్యత్యాసం ఉంది. కులాలతోను, మతాలతోనూ, ప్రాంతాలతోనూ సంబంధం లేకుండా మనుషులందరూ సమానమే అనే ప్రకటన మన రోజువారీ జీవితాల్లో స్త్రీలు, భిన్న లైంగికత కలవారి పట్ల అమలవుతున్న వివక్ష ఏ స్థాయిలో ఉందో తరచి చూస్తే, 'లింగం' ఆధారంగా పురుషాధితక్యత మనచుట్టూ కట్టిన కరుడుగట్టిన దారుణమైన 'దడి' ఎంతటిదో అర్థమవుతుంది.

అన్ని 'దోపిడీ'ల లానే పెళ్ళి పేరిట, సంసారం పేరిట మహిళపై జరిగే 'లైంగిక దోపిడీ' సైతం తుదముట్టించబడినప్పుడే సమతా సమాజానికి నిజమైన అర్థం ఉంటుంది. స్త్రీ–పురుష సమానత మాత్రమే కాదు సకల లింగ సమానతే సమసమాజ లక్ష్యం కావాలి. భిన్న లైంగికతని ఒక ప్రజాస్వామ్య హక్కుగా గుర్తించాలి. ఆ క్రమంలో పరాయీకరణకి గురౌతున్న వ్యక్తులు, సమిష్టిగా లింగ సమానత కోసం భిన్న రూపాల్లో, భిన్న మార్గాల్లో బహుముఖంగా ఉద్యమించాల్సి ఉంటుంది.



5

# పరాయీకరణ – కళ

– **కట్టా కృష్ణారావు,** సాంస్కృతిక కార్యకర్త, సెల్ : 9490186602

Alianation అంటే పరాయీకరణ.... అంటే?

ప్రతి మనిషికి శారీరకంగాగాని, మానసికంగా గాని, బౌద్ధికంగా గాని తన ఇచ్ఛానుసారం కాక, ఇతర శక్తుల నియంత్రణలో... అయిష్టంగా కొనసాగించే చర్యలే పరాయీకరణ. నియంత్రించే శక్తులకు ఎన్నో రూపాలు.. ప్రభువు, యజమాని, పాలకుడు, అధికారి, భూస్వామి, ధనస్వామి, చివరకు దేవుడు... కాళ్ళకో కళ్ళకో చేతులకో... చేతలకో.. బుద్ధికో... ఆలోచనలకో వేసే సంకెళ్ళు... ఇనుప సంకెళ్ళకు బదులు బంగారు సంకెళ్ళు తగిలించి నీపై ప్రేమతో, దయతో... కరుణతో... నీ మంచి కోసమే చేస్తున్నాను" అన్నా అది తగిలించుకున్న బురఖా... సాగించేది దోపిడి... చేసేది మోసం.. ఆలోచిస్తే తెలిసేది పరాయీకరణ... అయితే ఈ పరాయీకరణను గుర్తించడం చాల రంగాల్లో చాల కష్టం, చాలచాల సంక్లిష్టం.

సులభంగా అర్థం చేసుకోవాలంటే ఎలా?... ఈజీగా అర్థం చేసుకోవడానికి Lord Alford Tennyson ఒకచోట తన కవిత్వంలో సైనికుల గురించి ఇలా రాసాడు...

Their's is not to question why?

Their's is not to reason why?

Their's is to do and die...

సైనికులకి ప్రశ్నించడం... తర్కించడం కుదరదు... వారి కర్తవ్యం చంపడం.. లేదా చావడం.. అంతే.. ఎవరికోసం? పై వారి కోసం... పాలకుల కోసం... ఇదే పరాయీకరణ.

మరో ఉదాహరణ... ప్రతి దేశంలోను పోలీసు వ్యవస్థ ఉంది. వారి జీతభత్యాలు ప్రజల నుండి వసూలైన రెవెన్యూ నుండే చెల్లించేది. కాని కర్తవ్యం పేరుతో పాలకుల ఆజ్ఞల మేరకు అణచివేసేది ప్రజల్నే. విధి నిర్వహణలో ఎదురు నిలిచింది తనవారైనా "షూట్" అంటే వెనుకముందూ ఆలోచించకుండా షూట్ చేయడమే వారి పని.. అదే పరాయీకరణ.

మన మాతృదేశంలో, జన్మభూమిలో జరిగిన వేల సంవత్సరాల చరిత్రను పరిశీలిస్తే... ఎన్నో తెగలు.. జాతులు, దేశాలు... పాలకులు దండయాత్రలలో మనల్ని జయించి పాలించారు... పరాయీకరణకు గురిచేసారు. అది ఆర్యులు, హూణులు, కుషాణులు, అరబ్బులు, తరుష్కులు, పారశీకులు, మొగలులు, డచ్చి, ఫ్రెంచి, పోర్చుగీసు, ఆంగ్లేయులు ఇలా ఎందరెందరో... మనల్ని హస్తగతం చేసుకొని పాలించలేదా? వారి దోపిడికోసం మన ప్రజల్ని, మన యువకుల్నే సైనికులుగా తీసుకొని మనల్ని దండించి... చిత్రహింసలపాలు చేయలేదా? మన స్వదేశీయులే... స్వజాతీయులే కౄరాతికౄరంగా ప్రవర్తించలేదా? అదే పరాయీకరణ మహత్యం.

బ్రిటీష్ పాలకులైతే రెండవ ప్రపంచ యుద్ధంలో ఇరుక్కుని మన భారతీయ సైనికుల్ని హిట్లర్ సైన్యానికి వ్యతిరేకంగా పోరాడ్డానికి దేశదేశాలు తీసుకుపోలేదా? కిం మనకుండా వారి ఆజ్ఞలను పాటించడమంటే... పరాయీకరణే.

"కళాకారుడు నిరంకుశుడని, అతడి స్వేచ్ఛను ఎవరూ అరికట్టజాలరని ఒక మూఢ విశ్వాసం ఉంది. కళాకారులు కూడా వృత్తిపనివారికిందే అంటే శ్రామికులు గానే లెక్కించబడినప్పుడు అతడికేదో ప్రత్యేకత, అస్తిత్వము ఉండేదనుకోవడం ఒక సుందరమైన భ్రమ మాత్రమే. అతని శ్రమనూ, నైపుణ్యాన్నీ పాలకవర్గాలు తమ అవసరాలకు వినియోగించుకుంటాయి. కాని కళాకారులకుండే సహజమైన 'గర్వము'

వల్ల తాము దోపిడీకి గురి అవుతున్నామనే విషయాన్ని కూడా వారు గుర్తించలేరు" అంటారు హరిపురుషోత్తమరావు 'కళలు – చారిత్రక దృష్టి' అనే అంశంపై రాస్తూ...

మనం పరిశీలిస్తే అన్ని రంగాల్లోనూ నూటికి ఎనభైవంతులు ఈ పరాయికరణ అర్థమౌతుంది. బౌద్ధికంగా పరాయీకరణ సాధిస్తే మనుషులు మన్నుతిన్న పాములైపోతారు. అందుకే ప్రసార సాధనాలు, ప్రచార సాధనాలు, వినోదసాధనాలు, సంగీత, సాహిత్య, కళారంగాలన్నీ ప్రత్యక్షంగానో పరోక్షంగానో పాలకవర్గాల కనుసన్నల్లోనే సాగుతాయి. రాజ్యాధికారాన్ని గాని, దోపిడి మూకల నిజరూపాలు గాని, నయవంచనల్ని గాని వాటి ముసుగు తొలగించే ప్రయత్నం చేస్తే... అవన్నీ నిషేధానికి గురౌతాయి.

నాటక కళాప్రక్రియలో ఎలియనేషన్ ఎఫెక్ట్ అనేది ఒకటున్నది. ప్రపంచ రంగస్థలాన్ని స్టానిస్లావిస్కీ తరువాత ఎంతో ప్రభావితం చేసిన రంగస్థల మేధావి, జర్మన్ దేశస్తుడు బెర్ట్రోల్డ్ బ్రెట్ట్. ఇతని నాటకాన్ని ఎపిక్ థియేటర్ అంటారు. ఈ ఐతిహాసిక నాటకంలో ఎలియనేషన్ ఎఫెక్ట్ అనే ప్రత్యేక పద్ధతిని ప్రవేశపెట్టాడు. ఈ రంగస్థల ప్రయోగాన్ని "తాదాత్మ్య విచ్ఛిత్తి" అంటారు. అంటే ప్రేక్షకుడు తాను చూస్తున్న దృశ్యం తాలుకు రసాస్వాదనలో ఉన్నప్పుడు, దాన్ని భగ్నంచేసి, అతడు (ప్రేక్షకుడు) నాటకంలోని సన్నివేశాన్ని నిత్యజీవిత సంఘటనలతో సరిపోల్చుకుంటూ బేరీజు వేసుకుంటుండగా... మళ్ళీ నాటకంలోనికి తీసుకుపోవడం ఈ ప్రక్రియ. ఇది ప్రపంచ రంగస్థలంపై సెన్సేషన్ సృష్టించింది.

ఈ ఎలియనేషన్ ఎఫెక్ట్ ఎందుకు గుర్తొస్తుందంటే చూస్తున్నా.... జీవిస్తున్నా ప్రపంచంలో కొట్టుకుపోకుండా మనం ఎలా పరాయీకరణ చెందుతున్నామో తెలుసుకోవాలంటే మన బుద్ధికి విచక్షణ అప్లై చేసి సున్నితమైన పరిశీలనతో మనల్ని కప్పి ఉంచిన పొరల్ని తొలగించడానికి ప్రయత్నం కొనసాగాలంటే ఈ ఎలియనేషన్ ఎఫెక్ట్ – తాదాత్మ్య విచ్ఛితి అవసరమే.



6

# పరాయీకరణ – విద్య

– డా. చెలికాని కృష్ణమోహన్,
సామాజిక విశ్లేషకులు, సెల్ : 9000555374

పరాయీకరణ గాని విద్యను గాని స్పష్టంగా నిర్వచించడమనేది చాలా కష్టం. విద్యను రకరకాల కోణాల్లో రకరకాల కాలాల్లో రకరకాల సమాజాలలో రకరకాలుగా నిర్వచించారు. అందరు విద్యావేత్తలు అంగీకరించిన నిర్వచనం లేదు. The process of impartation of knowledge and skills to the next generation. Lenin "education is impartation of knowledge and skills in ideological framework". విద్య నాలుగు విధానాలలో నేర్చుకొంటాం. అవి formal education, non-formal education, informal education and accidental education. వీటన్నిటిలోను నేర్చుకున్న దానిని విద్యగానే పరిగణిస్తున్నాం.

పరాయీకరణ గురించి నేను వివరించవలసిన అవసరం లేదు. ఎందుకంటే కృష్ణారావు గారి పుస్తకంలో చాలా చక్కగా వివరించారు. మనిషి తన జీవిత అవసరాలు తీర్చుకోవడానికి లేదా అతని సృజనాత్మకతను బహిర్గతం చేయడానికి శ్రమ చేసినప్పుడు మనిషి నిజమైన మానవుడిగా ఉంటాడు. అది లేనప్పుడు అతని పరాయీకరణ లోనే జీవించవలసి వస్తుంది.

విద్యారంగంలో పరాయికరణ గురించి మార్క్స్ చర్చించిన అంశాలపై పుస్తకాలు అందుబాటులో లేవు. అయితే మానవ స్వభావానికి అతి దగ్గరగా ఉండే

విద్యారంగానికి పరాయీకరణకు దగ్గర సంబంధం ఉంది. ఇది మార్క్స్ రచనలలో అనేక రూపాల్లో వ్యక్తమవుతూ వచ్చింది.

మనిషి జీవితంలో శ్రమ, అనుభవం నుండి నేర్చుకోవడం కీలకమైనవి. శ్రమ ద్వారా తన అవసరాలు తీర్చుకోవడంతో పాటు తను క్రియాశీలకంగా ఉత్పత్తులు తయారు చేయడం ద్వారా ఆనందాన్ని పొందగలుగుతాడు. ఈ ప్రాసెస్‌లో అనేక విషయాలు నేర్చుకుంటాడు. తను నేర్చుకున్న విషయాలు ఇతరుల అనుభవాల నుండి నేర్చుకున్న విషయాలు తన సమాజంలో పంచుకోవడాన్ని విద్య అంటాం. శ్రమ, విద్య ఒకదానితో ఒకటి ముడిపడి ఉంటాయి. శ్రమ లేకుండా విద్య నేర్చుకోలేడు. అదే విధంగా విద్య లేకుండా లేదా అభ్యాసం లేకుండా ఉత్పత్తి చేయలేడు. శ్రమ ఎలాగైతే పరాయీకరణకు గురి అవుతుందో అదే విధంగా విద్య కూడా పరాయికరణకు గురి అవుతుంది. పెట్టుబడిదారీ సమాజంలో అన్ని రంగాల్లో లాగానే విద్యారంగంలో కూడా పరాయీకరణ తీవ్ర ప్రభావాన్ని చూపిస్తుంది.

మానవ శ్రమలాగే జ్ఞానసముపార్జన మానవ స్వభావం లక్షణం. అది జీవితంలో అంతర్భాగం. తన జీవిత అవసరాలు తీర్చుకోవడానికి అలాగే కొత్త విషయాలు నేర్చుకోవడంలో మనిషి లీనమై ఆనందాన్ని పొందుతాడు. ఈ ఆనందాన్ని పొందలేనప్పుడు బలవంతంగా నేర్చుకోవాల్సి వచ్చినప్పుడు మనిషి పరాయీకరణకు లోనవుతాడు.

మనిషి తన జీవిత అవసరాలకు, జీవిత విధానానికి సంబంధంలేని విద్య నేర్చుకోవలసి వచ్చినప్పుడు, విద్య నేర్చుకోవడంలో ఆనందాన్ని పొందలేనప్పుడు ఈ పరాయికరణ వ్యక్తమవుతోంది. కేవలం భవిష్యత్తులో డబ్బు సంపాదించడానికి ఉపయోగపడుతుందని బలవంతంగా నేర్చుకునే విద్య బలవంతపు శ్రమ లాంటిదే.

జీవిత వ్యక్తీకరణ శ్రమకు, జీవిత పరాయీకరణగా శ్రమకు మధ్య మార్క్స్ భావనాత్మక విభజన రేఖ గీశాడు. "శ్రమ పరాయీకరణకు గురిచేసే శ్రమ ఎప్పుడు అవుతుంది అంటే, నేను బతకడం కోసం జీవిత అవసరాలు తీర్చుకోవడానికి పని చేసినప్పుడు. అంటే నా పని నా జీవితం కానప్పుడు ఆ శ్రమ నన్ను పరాయికరిస్తుంది. అంటే నా పని బయటి అవశ్యకతగా నాపై రుద్దపడినదే కానీ నా అంతర్గత ఆవశ్యకత నుండి ప్రేరణ పొందిన ఒక అవసరం కాదు."

పిల్లలు విద్యార్థి దశ నుండి విద్యలో భాగంగా ఈ పరాయీకరణకు లోనవుతారు. పిల్లల్లో నేర్చుకునే సామర్థ్యాలు పెరగకుండానే మూడేళ్ళ వయస్సు నుండి వాళ్ళకి చదువు చెప్పడం మొదలుపెట్టి వాళ్ళు ఆడుకునే వయసులో వాళ్ళని నిర్బంధంగా కూర్చోబెట్టి బలవంతంగా విద్య నేర్పడం పరాయీకరణకు మొదటి దశ. వాళ్ళకు అర్థం కాని భాషలో, జీవితానికి సంబంధంలేని విషయాలతో వారి జ్ఞాపకశక్తిని కొలిచే పరీక్షలతో విద్య నేర్పడంతో వారి పరాయికరణ ప్రారంభ మవుతుంది. ఉదాహరణకు పూర్వ ప్రాథమిక పాఠశాలలు, ఇంగ్లీష్ మీడియం చదువులు. తన జీవిత విధానానికి స్కూల్ వాతావరణం భిన్నంగా ఉన్నప్పుడు పరాయి భాషలో విద్య నేర్చుకోవాల్సినప్పుడు ఈ పరాయికరణ మరింత తీవ్రంగా ఉంటుంది.

పెట్టుబడిదారి సమాజంలో విద్య అనేది ఒక కమోడిటీ వస్తువుగా మారిపోతుంది. విద్యార్థులు తన భవిష్యత్తు అవసరాలకు పనికొస్తుందనే ఉద్దేశంతో దీన్ని కొనుక్కుంటారు. దీనిలో జ్ఞానసముపార్జన గాని, దానిలో ఉండే సహజసిద్ధమైన ఆనందాలు ఏమీ ఉండవు. కేవలం భవిష్యత్ ఆర్థిక కోణం నుంచి నేర్చుకోవాల్సి వచ్చినప్పుడు వాళ్ళు దాంట్లో ఆనందాన్ని అనుభవించలేరు. కేవలం బలవంతంగా నేర్చుకుంటారు. ఈ బలవంతంగా నేర్చుకునేది బలవంత శ్రమతో సమానం. దీనిలో ఎటువంటి ఆనందం ఉండదు.

పెట్టుబడిదారీ సమాజంలో మార్కెట్ సర్వాంతర్యామి. అన్ని రంగాల్లో అదే నడిపిస్తుంది. అదే విధంగా విద్యారంగాన్ని కూడా అది నడిపిస్తుంది. పెట్టుబడిదారీ సమాజ అన్ని లక్షణాలు దీనికి వర్తిస్తాయి. ఆర్థిక జీవితంలో పరాయితనం మానవ జీవితానికి సంబంధించిన ఒక భాగం మాత్రమే. అయితే అది నిర్ణయాత్మకమైనది. దీని నుంచే మిగిలిన పరాయీకరణ పుట్టుకొస్తుంది.

మరో విధంగా చెప్పాలంటే ఉత్పత్తిని విద్యను పోల్చడం. ఇక్కడ కార్మికుడు వస్తూత్పత్తి ఎలా చేస్తాడో అభ్యాసకుడు జ్ఞానాన్ని నైపుణ్యాలను సంపాదిస్తాడు. సామాజిక సంబంధాలు కూడా స్కూల్లోనూ పెట్టుబడిదారీ పరిశ్రమల్లోనూ ఒకే లాగా ఉంటాయి. పరిశ్రమల్లో అలాగే స్కూల్‌లోని ఉపాధ్యాయులపై యాజమాన్యాల ఆధిపత్యం, విద్యార్థులపై ఉపాధ్యాయుల ఆధిపత్యం స్కూల్ నిర్వహణలో విధిగా

పాటించవలసిన నియమ నిబంధనలు ఉంటాయి. ఉత్పత్తిలో కార్మికుల మధ్య పోటీ ఉన్నట్టే విద్య నేర్చుకోవడంలో విద్యార్థుల మధ్య పోటీ ఉంటుంది. దీని ప్రభావం వల్ల స్కూల్స్ విద్యార్థుల మధ్య సహకారాన్ని కాకుండా విద్యార్థుల మధ్య పోటీ నిర్వహిస్తాయి. ఇదే మార్క్స్ చెప్పిన తన తోటి మానవుల మధ్య పరాయీకరణ.

పరాయీకరణ చెందిన కార్మికులు అలాగే విద్యార్థులు కూడా తమ విద్యపై తమకు నియంత్రణ లేకపోవడమే కాకుండా తాము నేర్చుకొనే అంశాలపై గాని అవార్డ్స్ గ్రేడ్స్‌పై కానీ నియంత్రణ ఉండదు. తను చేసే కార్యక్రమం మీద కాని, దాని ఫలితం మీదా తనకు ఓనర్‌షిప్ ఉండదు. అదే విధంగా ఇతరులు ఇచ్చే బహుమతులు కోసం పొగడ్తల కోసం విద్య నేర్చుకోవడం అనేది కార్మికులు ఆదాయం కోసం శ్రమ చేయడం లాంటిది.

కార్మికుల్లో ఉన్నట్టే విద్యార్థుల్లో కూడా పరాయీకరణ సామాజిక సంబంధాలు లోనే ఉంటుంది. అది ఒక కార్మికుడికి కానీ ఒక విద్యార్థికి గాని సంబంధించింది కాదు. ఇది విఫలమైన విద్యార్థికి మాత్రమే చెందినది కాదు. విజయవంతమైన విద్యార్థి కూడా ఈ పరాయీకరణకు గురవుతాడు. మెరిట్ స్టూడెంట్స్ మరీ ఇంత శ్రమపడి ఆ ఫలితాలు సాధించగలిగారు తప్ప ఆనందంతో సాధించినవి కాదు. దీనికి పరిశ్రమలో మిషన్‌లాగా పనిచేస్తూ అత్యుత్తమ ఉత్పత్తి సాధించే కార్మికులకి తేడా లేదు. ఇద్దరూ కూడా పరాయీకరణ పొంది చేస్తున్నారు.

విద్యారంగంలో పరాయీకరణ ఒక మానసిక భావనగా పరిగణించడం అనేది చాలా ఎక్కువ. కానీ ఇది ఒక మానసిక స్థితి కాదు, మొత్తం మానవుడికి చెందింది. Is not a state of mind in the state of whole person. ఇది పైకి నిరాసక్తత, అసహాయత, విచారం వంటి feelings, moods గా కనిపిస్తుంది. గాని, వాస్తవానికి ఇది అంతకన్నా చాలా విస్తృతమైంది.

విద్యార్థులే కాదు ఉపాధ్యాయులు కూడా పరాయీకరణకు గురవుతున్నారు. ఇది ఉపాధ్యాయుల మీద కూడా ప్రతిబింబిస్తుంది. తను చేసే పనిలో ఆనందాన్ని పొందలేనప్పుడు పెట్టుబడిదారీ వ్యవస్థలో కార్మికులు ఏ రకంగా పరాయీకరణకు గురవుతారో అదే విధంగా ఉపాధ్యాయులు కూడా అవుతారు. వీరూ ఒక రకమైన కార్మికులే. వీరే కాదు పెట్టుబడిదారీ సమాజంలో పెట్టుబడిదారులు కూడా

పరాయీకరణకు గురైనట్లు స్కూల్ యాజమాన్యాలు కూడా పరాయీకరణకు గురవుతాయి. వారు కూడా తమకు నచ్చిన విధంగా స్కూల్ నడపడానికి అవకాశం లేదు. మార్కెట్ శక్తులు ఏ విధంగా నిర్దేశిస్తూ ఏ కోర్సులు ఏ విధానాలు సూచిస్తే ఆ విధంగానే స్కూల్స్ నిర్వహించవలసి ఉంటుంది.

స్థూలంగా చెప్పాలంటే మార్క్స్ వివరించిన నాలుగు రకాల పరాయీకరణలు. (1) తన సొంత కార్యకలాపం నుండి పరాయీకరణ (2) తన ఉత్పదితం నుండి పరాయీకరణ (3) జాతి స్వభావం నుండి పరాయీకరణ (4) మనిషి నుండి మనిషి వేరు పడటం. ఈ నాలుగు రకాల పరాయీకరణలు కూడా విద్యారంగానికి దాదాపుగా వర్తిస్తాయి.

తను నేర్చుకునే చదువు తన అవసరాల కోసం, తన ఆనందం కోసం కాకుండా ఇతరుల అవసరాల కోసం నేర్చుకుంటున్న అది బలవంతపు శ్రమలాగే బలవంతపు విద్య పరాయీకరణకు గురవుతుంది. అంటే తాను నేర్చుకొనే ప్రక్రియ నుండి దూరం అవుతాడు. ఇది నేర్చుకునే కార్యకలాపం నుంచి పరాయీకరణ. రెండోది తన ఉత్పాదితం నుంచి పరాయీకరణ. తన ఉత్పాదితం అంటే శ్రమ ఫలితంగా వచ్చిన ప్రాజెక్ట్ నుండి కార్మికుడు ఏ విధంగా పరాయీకరణ అవుతాడో అదే విధంగా తను సంపాదించిన జ్ఞానం నుండి మనిషి దూరమైపోవడం విద్యారంగంలో చూడొచ్చు. దీనికి ఒక ఉదాహరణ ఇస్రో వారు రాకెట్ లాంచ్ చేయడానికి ముందు తిరుపతిలో ప్రత్యేక పూజలు నిర్వహించడం.

“వేరు పడిన శ్రమ మనిషిని జాతి నుండి వేరు చేస్తుంది” మార్క్స్ భావనను విద్యకు వర్తిస్తే వేరు పడిన జ్ఞానం మనిషిని జాతి నుండి వేరు చేస్తుంది. ఒక మనిషి జాతి స్వభావం నుండి వేరు పడితే ఇతర మనుషులు నుండి వేరు పడినట్లే. జ్ఞానం నుంచి తను వేరు పడినప్పుడు ఆ జ్ఞానం సమాజానికి ఉపయోగపడనప్పుడు మనిషి జాతి స్వభావం నుంచి పరాయీకరణ చెందుతాడు. ఇక మనుషుల నుండి మనుషుల పరాయీకరణ చేస్తే, శ్రమలో పోటీ మనుషుల మధ్య పరాయీకరణకు దారి తీస్తుంది. అదే విధంగా జ్ఞానసముపార్జనలో ఉన్న పోటీ మార్కుల కోసం గ్రేడ్లు కోసం ర్యాంకుల కోసం జరిగే పోటీ మనిషిని మనిషికి దూరం చేస్తుంది. ఇది ద్వేషపూరిత, శత్రుపూరిత వాతావరణాన్ని కలిగిస్తుంది. అదే తన తోటి మనిషి నుంచి వేరు చేస్తుంది. ఈ

రకమైన విద్యావిధానం వల్ల తన తోటి మనిషి మీద నమ్మకం పోయి సమాజానికి దూరంగా వ్యక్తిగతంగా బతకాలని ప్రయత్నం చేస్తూ ఉంటాడు. దీనికి మంచి ఉదాహరణ సాఫ్ట్‌వేర్ ఉద్యోగులు.

విద్యలో పరాయీకరణ ఎలా తగ్గించాలి? పూర్తి కమ్యూనిస్ట్ సమాజం వచ్చే వరకు ఇది తొలగించడం సాధ్యపడదా?? ఈ ప్రశ్నలు విద్యారంగంలో చాలా కీలకమైన ప్రశ్నలు.

మార్క్స్ చెప్పినట్లు పరాయీకరణ అనేది పెట్టుబడిదారీ సమాజంలో కార్మికుని స్థితిలో ఉద్భవించినది. ఆ స్థితిని మార్చకుండా పరాయీకరణ పూర్తిగా తొలగించడం సాధ్యపడదు. అదే విధంగా విద్యారంగంలో విద్యార్థి స్థితిలో ఉండే పరాయీకరణ క్లాస్‌రూమ్ మార్పులవల్ల తొలగించడం సాధ్యపడదు. సామాజిక సంబంధాలు విద్యా సంబంధాల్లో విప్లవాత్మక మార్పు వచ్చినప్పుడే ఇది సాధ్యపడుతుంది. పరాయీకరణ పూర్తిగా తొలగించడానికి పెట్టుబడిదారీ వ్యవస్థ తొలగి సమసమాజ స్థాపనకి కృషి చేస్తూనే, తాత్కాలికంగా విద్యావ్యవస్థలో మార్పులకు కృషి చేయడం ద్వారా విద్యారంగంలో కొంతవరకు పరాయీకరణ తగ్గించడానికి అవకాశం ఉంది.

దీనికి విద్యారంగంలో అనేక ప్రయత్నాలు జరుగుతూ ఉన్నాయి. ఆనందం కలిగించే విద్యని జాయ్ ఆఫ్ లెర్నింగ్ అని అనేక పేర్లతో అనేక ప్రయోగాలు జరుగుతున్నాయి. అవి పూర్తి పెట్టుబడిదారీ దేశాల్లో విజయవంతమైన ఉదాహరణలు అయితే ఎక్కడా లేవు గాని కొంత సంక్షేమాన్ని ప్రాధాన్యత ఇచ్చే దేశాల్లో ఈ ప్రయత్నాలు ఎక్కువగా జరిగాయి. వీటిలో ముఖ్యమైనవి ఫిన్లాండ్, నార్వే, డెన్మార్క్, న్యూజిలాండ్ ఉన్నాయి.

ఈ దేశాల విద్యార్థులు OCED దేశాల్లో నిర్వహించే PISA test లో అత్యంత ప్రతిభా పాటవాలు చూపిస్తున్నారు. వీటిల్లో విద్యా విధానంలో చాలా మార్పులు తీసుకొచ్చారు. 6 సంవత్సరాల వయస్సు వరకు ఎటువంటి చదువు అక్షరాభ్యాసం లేకుండా పూర్తిగా ఆటలు పైన ఇతర ఆశక్తుల పైన కేంద్రీకరించారు. పాఠాలు బదులుగా నేర్చుకునే నైపుణ్యాలను పెంపొందించడానికి ప్రోత్సహిస్తారు. అందరితో

కలిసి ఆడుకోవడం అందరితో కలిసి తినడం ఒకరికొకరు సహాయ పడటం పిల్లలు అలవరచుకునేలా ప్రోత్సహిస్తారు. విద్యారంగం పూర్తిగా ప్రభుత్వం నిర్వహిస్తుంది. ఎటువంటి ఫీజులు లేకపోవడమే కాకుండా భోజన వసతి లాంటి ఏర్పాటు చేస్తారు. పదో తరగతి వరకు మార్కులు, గ్రేడింగ్ విధానాన్ని రద్దు పరిచారు. పోటీతత్వాన్ని తగ్గించడానికి బహుమతులు ఇవ్వడం వంటి అనేక అంశాలలో చాలా జాగ్రత్తలు తీసుకున్నారు. విద్యార్థుల మధ్య హెచ్చుతగ్గులను సూచించే పరీక్షలను రద్దు చేశారు. పరీక్షల్లో ఉపాధ్యాయులు తమ శక్తి సామర్థ్యాలను పరీక్షించుకోవడానికి కానీ విద్యార్థులకు మార్కులు ఇవ్వడం వంటి అనేక అంశాలను రద్దుచేశారు.

అవి సంక్షేమ రాజ్యాలు కాబట్టి ఆ దేశాలలో పరిస్థితులు పరాయీకరణ తగ్గించడానికి కొంతవరకు దోహదం చేస్తున్నాయి. ప్రపంచంలో వేతన అసమానతలు తక్కువ ఉన్న దేశాల్లో ఫిన్లాండ్ ఒకటి. అయితే మన దేశం లాంటి దేశాల్లో ఈ సంస్కరణలు తీసుకురావడం ద్వారా ఇప్పుడున్న పరిస్థితులు కొంత మెరుగుపరుచుకోవడానికి అవకాశం ఏర్పడుతుంది.

దీనిమీద మరింత అవగాహన రావడానికి “మార్క్స్ & ఎడ్యుకేషన్”, రాబిన్ స్మాల్ రాసిన పుస్తకం కొంత ఉపయుక్తంగా ఉంటుంది.



7

# పరాయీకరణ – ఒక పరిశీలన

– **అద్దేపల్లి ప్రభు,** కవి & రచయిత,
సెల్ : 98489 30203

'పరాయీకరణ' అనే మాట తెలుగునాట రచయితల్ని – కవుల్నీ ఆకర్షించినంతగా సిద్ధాంతకర్తలనీ – రాజకీయ నాయకులనీ ఆకర్షించినట్టు లేదు. ఈ మాట భౌతిక వాస్తవం కన్నా కాస్త నిందగా ధ్వనించడం దానికి కారణమై ఉంటుంది. కానీ మార్క్సిజంలో పరాయీకరణ అనే భావానికి అత్యంత ప్రాధాన్యత ఉంది. మార్క్సిస్టు పరిభాషలో వర్గాలు, వర్గ పోరాటం, శ్రమశక్తి దోపిడి, గతితర్కం, చారిత్రక భౌతికవాదం వంటి వాటితో పాటు పరాయీకరణ అనేది కూడా ముఖ్యమైనదే. అయితే తెలుగులో వచ్చిన మార్క్సిస్టు సాహిత్యంలో గానీ, వివిధ కమ్యూనిస్టు పార్టీల వారు నిర్వహించిన రాజకీయ తరగతులలో గానీ మిగిలిన అన్ని విషయాలు చర్చకి వచ్చాయి తప్ప పరాయీకరణ మాత్రం రాలేదు. దీనికి కారణలేమైనా ఈ పాతిక ముప్పైఏళ్ళ సామ్రాజ్యవాద ప్రపంచీకరణ తరువాత – ప్రైవేటీకరణలూ, లిబరలైజేషన్లూ, ప్రభుత్వాలూ అంతకంతకూ చాల ప్రయోగాలు మీద ప్రేమ పెంచుకోవడం మొదలయ్యాకా పరాయీకరణ అనే ఒక అపరిచిత భావం మనల్ని అతలాకుతలం చేస్తోంది.

**పూర్వరంగం:**

పరాయీకరణ గురించి తెలుసుకునే ముందు గత శతాబ్దాలలో జరిగిన కొన్ని పరిణామాలని ప్రస్తావించుకోవాలి. యూరప్‌లో జరిగిన ప్రజాస్వామిక

విప్లవాలు, రష్యాలో జరిగిన సోషలిస్టు విప్లవం, వలస రాజ్యాల విముక్తి – ఈ మూడింటిని క్లుప్తంగా చూడాలి.

యూరప్‌లో పారిశ్రామిక విప్లవాల కాలంలో బూర్జువా వర్గం పాత కాలపు ఫ్యూడల్ వ్యవస్థల మీద తిరుగుబాటు చేసి రాజ్యాధికారం సాధించారు. అది మన కాలపు భాషలాగా ఒక ప్రభుత్వం పోయి మరో ప్రభుత్వం రావడం కాదు. ఒక వ్యవస్థ పోయి మరొక వ్యవస్థ రావడం, వ్యవస్థాగతమైపోయి మానవ జీవితాన్ని నిర్దేశక అన్ని రకాల ఫ్యూడల్ ఆధిపత్యాలని తోసి స్వేచ్ఛని పొందడం. మానవ జీవితం, మానవుని కార్యాచరణ కేంద్రంలోకి రావడం ఈ విప్లవ సారాంశం. యిందులో రైతులు, కార్మికులు, చేతివృత్తుల వారు వాటి అన్ని రకాల ప్రజా సమూహాలకీ బూర్జువా వర్గం నాయకత్వం వహించింది. ఫ్యూడల్ దోపిడీ పాలన అంతరించిపోతూ బూర్జువా దోపిడీ పాలన వ్యవస్థాగతమౌతూ వస్తున్నది.

ఈ పరిస్థితికి కొనసాగింపుగా 1917లో రష్యాలో సోషలిస్టు విప్లవం జరిగింది. పెట్టుబడిదారీ ప్రజాస్వామిక విప్లవాన్ని సోషలిస్టు ప్రజాస్వామిక విప్లవంగా అభివృద్ధి చేసి దాన్ని సాధించిన వారు లెనిన్ – బోల్షివిక్కులు. అప్పటికే అనేక దేశాలలో విప్లవాలు సాగుతున్నాయి. ఆసియా దేశాలలో వలస రాజ్యాలకి వ్యతిరేకంగా జాతీయోద్యమాలు తీవ్రంగా జరుగుతున్నాయి. యిటువంటి పరిస్థితిలో సోషలిస్టు విప్లవం విజయవంతం కావడంతో యూరప్‌లోని బూర్జువా వర్గం మాత్రమే కాదు – వలస దేశాలలోని జాతీయోద్యమ నాయకత్వం కూడా భయకంపితమైపోయారు. తమ వెనుకనే ఉద్యమాలలో ఉన్న కార్మికుల్ని, రైతుల్నీ చూసి హడలిపోయి తాము ఎవరిపైనైతే పోరాడుతున్నారో అదే వర్గంతో మైత్రికీ రాజీకి దిగడం మొదలుపెట్టారు. అప్పటివరకు వారిలో ఉన్న ప్రగతిశీలత నశించి నిరోధకత పెరగడం మొదలైంది.

వలస రాజ్యాలలో ముఖ్యంగా భారతదేశంలో దీని ఫలితం చాలా వినాశకర పరిణామాలకి దారితీసింది. సామ్రాజ్యవాదుల నీడలో తలెత్తి పెరుగుతున్న పెట్టుబడిదారీవర్గం సామ్రాజ్యవాదులతో పోటీని, పోరాటాన్నీ వదిలి రాజీకీ, లొంగుబాటుకి మొగ్గుచూపారు. దీనివల్ల ఇక్కడి జాతీయోద్యమం ప్రజాస్వామిక ఉద్యమంగా కాకుండా అధికార మార్పిడి ఉద్యమంగా ముగిసిపోయింది.

తరువాతి కాలంలో రెండు దశలు నడిచాయి. 1. సోవియట్ రష్యా నాయకత్వంలోని సోషలిస్టు శిబిరం. 2. అమెరికా నాయకత్వంలోని బూర్జువా శిబిరం ఈ రెంటికీ మధ్య పోరాటం నడిచింది. రెండోది సోవియట్ రష్యాలో సోషలిజం ఓడిపోయి అంతరించి అది సోషల్ సామ్రాజ్యవాదంగా మారిన తరువాత రష్యాకీ – అమెరికాకి నడిచిన ప్రచ్ఛన్నయుద్ధం. ఈ ప్రచ్ఛన్న యుద్ధం రష్యా పతనమైన తరువాతి కాలంలో ప్రపంచీకరణగా మారిపోయింది. క్లుప్తమైన ఈ నేపథ్యాన్ని మనం గుర్తుంచుకోవాలి. ఇది ప్రపంచ రాజకీయ వాతావరణం. 20వ శతాబ్దం ప్రపంచాన్ని మార్చగలమనీ, మనిషి చరిత్ర నిర్మాత అనీ విశ్వసించిన కాలం. శ్రామికులు – కార్మికులు అన్ని దోపిడీలను నాశనం చేసి క్రొత్త ప్రపంచాన్ని నిర్మించగలమని నమ్మిన కాలం. తన భౌతిక అవసరాల కోసం అతి తక్కువ కాలం పనిచేసి ఎక్కువ కాలాన్ని కళల కోసం, సైన్స్‌కోసం, ప్రకృతి కోసం వెచ్చించగలమని – నమ్మినకాలం, 21వ శతాబ్దం క్రూరమైన మలుపు తీసుకుంది. అణగారిపోయిన ఫ్యూడల్ ప్రతీక శక్తులన్నీ పైకి లేచి ప్రపంచాన్ని పరాయీకరణలోకి మరింతగా తోశేశాయి. తాను బతికి ఉండడం కోసం 10–12 గంటలు పనిచేయాల్సి రావడం తప్పనిసరైన మనిషి తన జీవితానికీ ప్రపంచానికీ పరాయివాడుగా మారిపోతున్నాడు.

ఇటువంటి పరిస్థితినే పరాయీకరణ అంటున్నాం.

2

ఒకటి మనం కాకుండా పోవడం పరాయీకరణ. ఒకదానికి మనం కాకుండా పోవటం పరాయీకరణ. సాధారణ పరిభాషలో యిది ఒక మానసిక సమస్యగా కనిపిస్తుంది. పైగా యిది సహజమనీ మానవ నాగరికతలో యిదొక అనివార్య ఫలితమని అనిపిస్తుంది. ఒక వృత్తిపనికి సంబంధించిన వ్యక్తి, ఉదాహరణకి – మేదర పనివాడు అనుకుందాం – అతను వెదురును చీల్చి బద్దలు చేసి చక్కటి అందమైన బుట్టని అల్లుతాడు. అది అతనిది. అతను ఆ అందమైన బుట్టని చూసి మురిసిపోతాడు. దాన్ని యింకా బాగా ఎలా చేయవచ్చా అని ప్రణాళికలు వేస్తాడు. ఆ మేదరిని ఈ బుట్ట ఎవరిది అని అడిగితే ఇది నాదేనండి అంటాడు.

ఇంకొకటి చూద్దాం. బుట్టలు తయారుచేసే కార్ఖానాలో ఒక వ్యక్తి టన్నులకొద్దీ వెదురు బొంగును తెచ్చి వందమంది మేదర్లతో బుట్టలు చేయిస్తాడు. అందులో ఏ

ఒక్క మేదరీ తాను చేసిన బుట్ట తనది అని చెప్పుకోడు. చెప్పినా ఒప్పుకోడు. అతనక్కడ పనిచేసాడు. ఆ పని చేసినందుకు కూలి తీసుకున్నాడు. కూలి మాత్రమే తనది తాను చేసిన బుట్ట తనది కాదు. యజమానిది.

ఈ రెండు ఉత్పత్తి పద్ధతులకీ ఉండే తేడాలో చాలా విషయాలు ఉన్నాయి. కార్ఖానాలో జరిగిన ఉత్పత్తి వల్ల మేదరి తన శ్రమ ఫలితమైన బుట్టకి తాను పరాయివాడైయాడు.

కానీ యిది కరెక్టే కదా! వెదురు బొంగులు – పని స్థలం – కత్తులు, ఇతర పరికరాలు అన్నీ యజమాని తెచ్చి ఇచ్చాడు. మేం చేసింది వాటిని బుట్టలుగా మార్చడం – కాబట్టి ఆ బుట్టలు మావి కావు, యజమానివే అని ఆ పనివాళ్ళూ అంటారు. యిది సహజంగా కనిపిస్తుంది. ఈ పని జరిగే క్రమం ఒకటి ఉంది. ఒక పనివాడు ఒక బొంగుని తీసుకుని చీల్చి బుట్టలు చేయడం కన్నా కొంతమంది చీల్చడానికీ – కొంతమంది ముక్కలు చేయడానికీ, కొంతమంది అల్లడానికీ, కొంతమంది రాసలు వేయడానికీ కేటాయిస్తే – ఈ శ్రమ విభజన వల్ల ఆ వందమంది పనివాళ్లలో ఉత్పాదకత విస్తారంగా పెరిగి ఉత్పత్తి చాలా అధికమౌతుంది. ఈ విషయం మనకి రోజువారీ అనుభవంలో ఉన్నదే. అందులో పనిచేసిన ఏ వ్యక్తీ తాను స్వయంగా బుట్టని అల్లానని చెప్పుకోలేడు. ఇక్కడ తామంతా కలిసి ఏ ఉత్పత్తిని అయితే సృష్టించారో ఆ ఉత్పత్తి తమది కాదు. ఏ పని చేయకుండా డబ్బు ఖర్చుపెట్టి వీరందర్నీ ఒకచోటకి చేర్చిన వ్యక్తి ఆ ఉత్పత్తికి సొంతదారు. ఇది – మామూలుగానే కనిపిస్తున్నాది. కాని యిది పరాయీకరణ.

పరాయీకరణకి సంబంధించిన ఆర్థిక కోణాన్ననుసరించి పరిశీలించి నప్పుడు ఉత్పత్తి శక్తులు పెరుగుతున్నకొద్దీ పరాయీకరణ మరింతగా పెరుగుతుందని అర్థమౌతుంది.

## 3

కారల్ మార్క్స్ సిద్ధాంతంలో పరాయీకరణకి చాలా కేంద్రస్థానం యిచ్చి దీని గురించి తాత్వికంగా, ఆర్థికంగా, సామాజికంగా, రాజకీయంగా, అనేక కోణాల్లోంచి పరిశోధించడం చేసాడు. మార్క్స్ పెట్టుబడిని విశ్లేషించి రెండు

ప్రధానమైన అంశాలు చెప్పాడు. (1) పెట్టుబడిదారి విధానం మనిషిని పరాయీ కరిస్తుంది. (2) పెట్టుబడిదారి విధానం మనిషిని దోపిడి చేస్తుంది. ఈ రెండు విషయాలు ఈవేళ మనకి స్పష్టంగా తెలుస్తూనే ఉంటాయి. పరాయీకరణ గురించి మార్క్స్ నాలుగు విధాలుగా చెప్పాడు. (1) శ్రామికులు తమ ఉత్పత్తినించి పరాయీకరణ చెందడం, (2) శ్రామికులు శ్రమ కార్యకలాపం నించి పరాయీకరణ చెందడం, (3) తోటి మనుషుల నించి పరాయీకరణ చెందడం. (4) తన స్వంత మానవ స్వభావం నించి పరాయీకరణ చెందడం.

**ఒక్కొక్కదాని గురించీ చూద్దాం:**

**1. శ్రామికులు తమ ఉత్పత్తి నించి పరాయీకరణ :**

మనిషి శ్రమ చేసే ఒక జంతువు. ఈ శ్రమే మానవుల్ని జంతువుల నించి వేరు చేసింది. మనిషి ప్రకృతిలో తనకు లభించిన కొన్ని పదార్థాలను, లేదా వస్తువులను ఉపయోగించి, తన శ్రమని వినియోగించి కొన్ని వస్తువులని తయారు చేస్తాడు. వస్తువుకి ఉపయోగపు విలువ మాత్రమే కాకుండా వినిమయ విలువ కూడ ఉంటుంది. ఈ రెండు విలువలూ ఏర్పడటం అనేది మానవ సంబంధాలలో కీలకమైన అంశం. ఇందాకటి ఉదాహరణలో లాగా మేదర పనివాడు తన స్వంతానికి చేసుకున్నప్పుడు ఆ బుట్ట అతనికి పరాయిది కాదు. అది అతని సొంతం. కానీ కార్ఖానాలో తయారుచేసిన బుట్ట అతని సొంతం కాదు. ఆ బుట్ట ఒక ఉత్పాదక వస్తువు. శ్రామికుడు పరాయీకరణ చెందినది. అంతేకాక ఆ వస్తువు ఆ ఉత్పత్తి చేసిన శ్రామికుని శ్రమ నించి వేరుపడి దానికదే ఒక స్వతంత్ర శక్తిగా తయారై వ్యతిరేకంగా నిలుస్తుంది.

ఉత్పత్తి అయిన వస్తువుకి సంబంధించి మార్కెట్, అంటే దాన్ని అమ్మకమూ కొనుగోళ్ళతో శ్రామికునికి ఎటువంటి సంబంధమూ లేదు. అతను పని చేస్తూ తన శ్రమ శక్తి ద్వారా నిరంతరం వస్తువుల్ని సృష్టిస్తూనే ఉంటాడు. కానీ మార్కెట్‌లో గనక ఆ వస్తువులకి గిరాకీ తగ్గితే యజమాని ఉత్పత్తి తగ్గించడం – అందుకోసం శ్రామికుల్ని తీసేయడం చేస్తాడు. తాను నిరంతరం చేసిన ఉత్పత్తియే తన పాలిట శత్రువై తన పనినించి తనని గెంటివేయడం జరుగుతుంది.

పారిశ్రామిక ఉత్పత్తి విధానంలో యంత్రాల వినియోగం పెరుగుతున్న కొద్దీ పరాయీకరణ పెరుగుతూ ఉంటుంది. ఒక కార్లు తయారు చేసే కంపెనీలో పనిచేసే ఒక కార్మికుడు బోల్టులు బిగించే పనో–చక్రాలు బిగించే పనో చేస్తాడు. అతని పని అంతవరకే. కారు అనే ఉత్పాదక వస్తువుతో అతనికి ఎటువంటి సంబంధమూ లేదు. తన ఉత్పత్తికి తానే పరాయివాడైపోవడం.

ఒక్కడే కారుని తయారుచేయాలని అప్పుడే అతనికి ఆ వస్తువు పరాయిది కాకుండా ఉంటుందనీ కాదు దీని అర్థం. ఉత్పత్తికి సంబంధించిన సామాజిక స్వభావం పెరగడం సహజం. కానీ ఆ ఉత్పత్తి ఒక యజమాని స్వాధీనం చేసుకోవడం వల్లనే ఈ పరాయీకరణ జరుగుతుంది.

**2. శ్రమ కార్యకలాపం నుంచి పరాయీకరణ :**

పెట్టుబడిదారి ఉత్పత్తి విధానంలో శ్రామికుడు ఒకే ఒక పనికి పరిమితమైపోతాడు. ఆ పని కూడా తనకి ఎటువంటి పనితృప్తిని ఇవ్వనిది. ఒక ఫ్యాక్టరీలో నట్లు బిగించిన వాడికి జీవితాంతం అదే పని ఉంటుంది. ఇది అతనికి సంతృప్తిని ఇవ్వకపోవడమే కాదు అతని జీవితాన్ని పీల్చిపిప్పిచేస్తుంది. శ్రామికుడి శ్రమశక్తి సరుకుగా మారడం వల్ల సృజనాత్మకమైన ఆ శ్రమశక్తి శ్రమ చేయగల దాన్ని పొందగలగడం అనే దగ్గర అతనికి వ్యతిరేకంగా మారుతుంది. దీనివల్ల శ్రామికుడు బతికి ఉండడం కోసం పనిచేయాల్సి రావడం, అతని ఇష్టాయిష్టాలతో – అభిరుచులతో నిమిత్తం లేకుండా అతడు జీవించి ఉండడం కోసం తన శ్రమశక్తితో పనిచేయాల్సి రావడం జరుగుతుంది. కాబట్టి అతని శ్రమశక్తి పరాయీకరణ చెందుతుంది. అతడు పనిలో లేనప్పుడే తనకి తాను మనిషిగా అనుభూతి చెందుతాడు.

ఉత్పత్తి శక్తులలో నిరంతరం విప్లవం లేకుండా పెట్టుబడిదారీ విధానం మనలేదు – అంటాడు మార్క్స్. ఉత్పత్తి శక్తులలో మార్పు వచ్చినప్పుడల్లా దాని ఫలితంగా ఉత్పత్తి సంబంధాలలో కూడా విప్లవాత్మకమైన మార్పులు వస్తాయి. పూర్వ ఉత్పత్తి విధానాలలో ఉత్పత్తి శక్తుల అభివృద్ధికీ – పాత కాలపు ఉత్పత్తి సంబంధాలకీ మధ్య వైరుధ్యం ఏర్పడి విప్లవాల ద్వారా సమస్య పరిష్కారం జరిగింది. పెట్టుబడిదారీ విధానం నిరంతరం ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని కోరుతుంది. బొగ్గు – ఆవిరి – విద్యుత్తు, పెట్రోలు అణుశక్తి యిలా ఒక దాని తరువాత మరొక అభివృద్ధి క్రమం కొనసాగుతూనే ఉంది.

ఉత్పత్తి కార్యకలాపాలలో యాంత్రికత పెరుగడం అనేది ఉత్పత్తిని అనంతంగా పెంచుతుంది. శ్రమ విభజన పద్ధతులు మారడం ద్వారా కూడా ఉత్పత్తి, ఉత్పాదకత శక్తి పెరుగుతాయి.

ఒకటి రెండు మిషన్లతో బట్టలు కుట్టే టైలర్ మనకి బాగా పరిచయం ఉన్నవాడు. రెడీమేడ్ బట్టల మార్కెట్ పెరిగినాక టైలరింగ్‌కి డిమాండ్ పడిపోవడం – టైలర్లు తమ వృత్తిని కోల్పోవడం మనం చూస్తున్నదే. మరోపక్క రెడీమేడ్ దుస్తుల తయారీ ఫ్యాక్టరీలలో ఉత్పత్తి శక్తుల అభివృద్ధి విపరీతంగా పెరుగుతూ ఉంది. బట్టను కత్తిరించడానికీ, కుట్టడానికీ మధ్య అనేక పనుల విభజన జరిగి అంతిమ ఫలితం వచ్చేసరికి దుస్తులు నేను కుట్టాను అనే వ్యక్తి ఎవరూ ఉండరు. అందరూ ఆ ఉత్పత్తి ఫలానికి పరాయీకరణ చెందినవారే.

**3. తోటి మనుషుల నుంచి పరాయీకరణ:**

నిరంతరం పెరిగే ఉత్పత్తి శక్తులు శ్రమ విభజన సాధనాల వల్ల అనంతంగా పెరిగిన ఉత్పత్తి మార్కెట్ కావడం ఒక సమస్య. యింత భారీ స్థాయి ఉత్పత్తికి ప్రపంచ మార్కెట్ కావాలి. వినియోగదారి మనస్తత్వం కావాలి. (మనిషి తన సహజ మానవ స్వభావాన్ని వదిలి వస్తు కొనుగోలుదారుగా పరాయీకరణ చెందాలి) దీంతోపాటు జరిగే మరొక విషయం తమ శ్రమ శక్తి ఫలితమైన ఉత్పత్తి తమకి పరాయీగానే కాదు శత్రువుగా కూడా మారిపోవడం. కార్మికులు ఎక్కువ ఉత్పత్తి చేసే కొద్దీ ఉత్పత్తి ఎక్కువై చివరికి అది అతని ఉద్యోగాన్ని పోగొడుతుంది. తన ఉద్యోగాన్ని తన పనిని నిలబెట్టుకోవడానికి శ్రామికుడు తన తోటి శ్రామికునితో పోటీ పడాల్సి వస్తుంది. ఈ పరిస్థితి వల్ల అతను తోటి మనుషుల నించి పరాయివాడై పోతున్నాడు. సమాజంలో భయంకరమైన పోటీతత్త్వం నెలకొంటుంది. ప్రతి మనిషి మరొక మనిషిని సాధనంగా పరిగణిస్తాడు. తనూ ఒక సాధనంగా తయారౌతాడు!

ఇలా మనిషి తనకు తానే ఉత్పత్తి సాధనంగా మారిపోయి పరాయీకరమౌతున్నాడు. "శ్రామికుడు తనకుతాను ఎంత ఎక్కువగా పనిలో నిమగ్నమైతే, అంత ఎక్కువగా అతను సృష్టించిన పరాయివస్తు ప్రపంచం అతనికి వ్యతిరేకంగా అంత శక్తివంతం అవుతుంది." అంటాడు మార్క్స్.

**4. స్వంత మానవ స్వభావం నించి పరాయీకరణ:**

మనిషి ప్రకృతికి చెందినవాడు. అయితే అతడు వస్తువులను తయారు చేయగల నిర్మాత. "మనిషి వేటితో అయితే సంబంధం కలిగి ఉంటాడో ఆ ప్రాకృతిక వస్తువులు వేరొకరి స్వంత ఆస్తిగా మారినప్పుడు జంతువు కంటే అదనంగా మనిషికున్న సానుకూల అంశాలు ప్రతికూల అంశాలుగా మారిపోతాయి."

నిజానికి పెట్టుబడి అనేది శ్రామికుల అదనపు విలువ సృష్టించిన ఒక సామాజిక సంబంధం. కానీ పెట్టుబడి శ్రామికుణ్ణి పరాయీకరించి అతనిపై పెత్తనాన్ని సాగిస్తుంది. అతన్ని సామాజిక మానవ సంబంధాల నించి పరాయి చేస్తుంది.

**పరాయీకరణ – తాత్విక భావనలు:**

పరాయీకరణ అనే భావం చాలా పురాతన కాలపు మానవుని ఆలోచనలో ఉంది. అయితే మార్క్స్ ముందు ఈ భావాన్ని గురించి చెప్పిన ఫ్యూయర్‌బా అనే తత్త్వవేత్త క్రైస్తవ మతసారం అనే గ్రంథంలో ఈ భావన గురించి చెబుతాడు. అతడు దీన్ని మత భావనగా చెబుతూ మానవులు తాను సృష్టించిన మతంలో తన స్వభావాన్నీ, చైతన్యాన్ని పరాయీకరించుకుంటారని ఆయన అంటారు. అంటే మనిషి తన సామర్థ్యాలనూ, తన ఆలోచనలను భగవంతుడు అనే ఒక కల్పిత భావానికి ఆపాదించి తమ సొంతమైన శక్తులను అతడు పరాయివిగా భావించుకుంటాడు. అంటే తాను సృష్టించిన దేవుడికి తనలోని శక్తులన్నీ యిచ్చి వాటికి తానే పరాయివాడై సకలమైన శక్తులు ఉన్న దేవుడిని ఆరాధిస్తూ ఉంటాడు. సాధారణ జీవితంలో మనిషికీ భగవంతుడికీ ఉండే ఎటువంటి సంబంధంలోనైనా మనం ఈ పరాయీకరణను పరిశీలించగలం. కాబట్టి మతం ఒక పరాయీకరణ రూపం అంటాడు.

పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో సరుకీకరణ (Commodification) అనేది చాలా ప్రధానమైన విషయంగా గుర్తుపెట్టుకోవాలి. అది వస్తువు గావచ్చు, సేవ కావచ్చు, మానవ సంబంధం కావచ్చు.... ఏదైనా సరే వినియోగపు విలువని సంతరించుకొని మార్కెట్‌లో అమ్మకపు సరుకుగా నిలబడాలి. ఈ అంశం మనకి ప్రపంచీకరణ తరువాత బాగా తెలుస్తుంది. నీళ్ళని సరుకు చైడం, ఇసుకని సరుకు చైడం, మానవ సంబంధాలని సరుకుగా మార్చడం మనం చూస్తున్నాం.

సరుకీకరణ అనేది ఎంత విస్తారంగా జరిగితే అంత విస్తారంగా, పరాయీకరణ జరుగుతుంది. ఫ్యాక్టరీ ఉత్పత్తిలో తమ శ్రమ ఫలాన్నించి పరాయీకరణ చెందినట్లే సేవలు ఉత్పత్తిగా మారిన తరువాత మానవ సంబంధాల నించి కూడా పరాయీకరణ చెందుతారు. ప్రపంచీకరణ అనంతరం గడిచిన ఈ మూడు దశాబ్దాల కాలాన్ని పరిశీలిస్తే మధ్య తరగతి వారి ఆదాయం పెరిగినమాట నిజమే కానీ పరాయీకరణ ఒక మానసిక సామాజిక సంక్షోభంలోకి వారిని నెట్టేసింది.

భారతీయ సామాజిక తాత్త్విక మత భావనలలో – నిర్మాణంలో పరాయీకరణ మూలం కులాల రూపంలో వ్యక్తమౌతూ ఉంటుంది. కులాలుగా అన్యధాకరింపబడిన మానవ సమూహాలు మిగిలిన సమాజానికి పరాయిగా ఉండడం – ఉంచబడడం భారతీయ సమాజంలో చూస్తాం: కుల వ్యవస్థని భగవంతుడు నిర్మించాడని దాన్ని యధాతథంగా నిర్వహించడమే ధర్మమనీ భావించే సమాజం పరాయీకరణని ధర్మంగా, పవిత్రమైనదిగా సిద్ధాంతీకరించి దానిచుట్టూ మతాన్ని నిర్మించింది.

పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద విస్తరణనీ, దోపిడీని సోషలిజం అడ్డుకోగలిగిన కాలంలో ఎంతో కొంత పరాయీకరణ భావన అధిగమించే ప్రయత్నం జరిగింది. కానీ ప్రపంచీకరణ ఆ క్రమాన్ని పూర్తిగా వెనక్కి తిప్పగలిగింది. భూమిమీది సకల వనరులనూ ప్రైవేటుపరం చేయడం అంటే మానవజాతిని ప్రకృతికి పూర్తిగా పరాయి చేయడమే. సున్నితమైన మానవ సంబంధాలని కూడా సరుకు రూపంలోకి మార్చడం ద్వారా డబ్బు అనే ఫెటిషిజం తీవ్రంగా పెరిగిపోతుంది. దీనిని అధిగమించడం అవసరం.



# 8

## పరాయీకరణ – సమావేశం రిపోర్టు

**– పెద్దింశెట్టి లెనిన్ బాబు,** సామాజిక కార్యకర్త,
సెల్ : 98666 64333

ఆధునిక కాలంలో మనిషి తనకు తాను పరాయివాడుగా జీవిస్తున్నాడు. రోజువారీ జీవితంలో సంతృప్తి లేకుండా సర్దుకుపోతున్నాడు. శ్రమతో చేజిక్కించుకున్న కొద్ది పాటి సంపద కాస్తా సరుకుల ఆరాధన పుణ్యమా అని ఆవిరైపోతోంది. ఇలాంటి పరిస్థితుల నేపథ్యంలో మానవుని జీవితం సమస్యలమయమవుతోంది. రోజురోజుకూ పెరిగిపోతున్న ఈ పరిస్థితుల పుట్టుకకు మూలం పెట్టుబడిదారీ వ్యవస్థే. వర్గ రహిత సమాజంలో కనిపించని, పెట్టుబడిదారీ సమాజంలో తీవ్ర ప్రభావాన్ని చూపుతున్న ఈ పరిస్థితులను "పరాయీకరణ" పేరుతో కారల్ మార్క్స్ ఏనాడో సిద్ధాంతీకరించిన సంగతి అంతగా ప్రాచుర్యం పొందలేకపోయింది. పరాయీకరణ తీరుతెన్నులను, మానవ స్వభావాన్ని మార్క్స్ ఏ విధంగా అవగాహన చేసుకున్నాడో వివరిస్తూ పలు మార్క్సిస్టు గ్రంథాల రచయిత రావు కృష్ణారావు గారు ఎలియనేషన్ పేరుతో పుస్తకాన్ని రాసారు. మార్క్స్ పరాయీకరణ సిద్ధాంత సంక్షిప్త పరిచయం లక్ష్యంగా సాగిన ఈ పుస్తకాన్ని విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారు ప్రచురించారు. డాక్టర్ చెలికాని రామారావు స్మారక సమితి వారు రామచంద్రపురంలో ఈ పుస్తకంపై "ఎలియనేషన్ – ఒక సమాలోచన" పేరుతో అవగాహన కార్యక్రమం నిర్వహించారు. ఈ కార్యక్రమం పరాయీకరణ తీరుతెన్నులపై అవగాహన చేసుకునేందుకు ఎంతగానో ఉపకరించింది. కార్యక్రమం నిర్వాహకులు డాక్టర్ చెలికాని స్టాలిన్ గారి కృషి ప్రశంసనీయం. చదువరులకు పుస్తకాలను సమకూర్చడమే కాకుండా పుస్తకంపై సమీక్షను స్వయంగా పర్యవేక్షించారు. మూఢనమ్మకాలు మనిషి జ్ఞానాన్ని చంపేస్తున్నాయని ఆవేదన వ్యక్తం

చేశారు. మార్క్స్ చెప్పిన అనేక విషయాలు ప్రాచుర్యంలో లేని నేపథ్యంలో రచయిత రావు కృష్ణారావుగారు చేస్తున్న కృషి అభినందించతగినదన్నారు. తను రచించిన "ఎలియనేషన్" పుస్తకాన్ని చదివి నిర్మొహమాటంగా పుస్తకంపై విమర్శ, సూచనలు, సలహాలను ఇవ్వాలని ఆహ్వానించి రచయిత కృష్ణారావు గారు నమ్రతను చాటుకున్నారు. సామాజిక కార్యకర్త గౌరవ్ గారు కార్యక్రమ ప్రాధాన్యతను వివరిస్తూ పుస్తకంలోని అంశాలను పరిచయం చేశారు. మరో సామాజిక కార్యకర్త పెద్దింశెట్టి రామకృష్ణారావు మాట్లాడుతూ శ్రామికవర్గ దోపిడీ తీవ్రత పెరుగుతున్న నేపథ్యంలో సైద్ధాంతిక కృషి తగిన స్థాయిలో పెరగాల్సిన ఆవశ్యకతను నొక్కి చెప్పారు.

**అద్భుతంగా సాగిన అద్దేపల్లి ప్రసంగం:**

"పరాయీకరణ – ఒక పరిశీలన" పేరుతో ప్రజాకవి అద్దేపల్లి ప్రభు చేసిన ప్రసంగం అద్భుతంగా సాగింది. 1990 కాలం నుంచి ప్రపంచీకరణ ప్రభావంతో పరాయీకరణ పరిస్థితులు తీవ్రం కావడం ఆరంభించాయన్నారు. ప్రజా ఉద్యమాలకు కీలకంగా ఉండే మధ్యతరగతి ప్రజలు తీవ్ర ప్రభావాలకు లోనుకావడంతోబాటు ఆ వర్గం నుంచి ఉద్యమాల పట్ల స్పందన సన్నగిల్లుతూ వస్తుందన్నారు. మనిషి సామాజిక బాధ్యత నుంచి పరాయివాడుగా మారిపోయాడన్నారు. అదనపు విలువను సామాజికపరం చేయడమే పరాయీకరణ ప్రభావాలకు సరైన పరిష్కారమన్నారు. తన శ్రమతో తయారు చేసిన ఉత్పత్తికి మనిషి పరాయివాడవుతున్నాడని, ఉత్పత్తిపై శ్రామికునికి ఎలాంటి హక్కులు లేకుండా పోయాయన్నారు. మనిషి తన రోజువారీ జీవితంలో వ్యాయామం, ఆట, పాటలు, వినోదం, కళా ప్రదర్శనలు ప్రధానంగా ఉండాల్సినప్పటికీ డబ్బు సంపాదనకోసం అధిక సమయాన్ని వృత్తి వ్యాపారాలకే కేటాయించి వాస్తవిక సమాజం నుంచి పరాయీకరణ చెందుతున్నాడన్నారు.

**విద్యా పరాయీకరణను విపులంగా వివరించిన డాక్టర్ చెలికాని కృష్ణమోహన్:**

"పరాయీకరణ–విద్య" అంశంపై డాక్టర్ చెలికాని కృష్ణమోహన్ చేసిన ప్రసంగం గతి తప్పిన విద్య తీరుకు చక్కటి దారిని చేప్పేదిగా సాగింది. విద్యారంగంలో ప్రైవేటీకరణ నేపథ్యంలో కీలకమైన మార్పులు చోటు చేసుకున్నాయని, చదువు లక్ష్యం గాడి తప్పడంతో విద్యారంగంలో కీలకంగా వ్యవహరించే ఉపాధ్యాయులు, విద్యార్థులు పరాయీకరణకు లోనవుతున్నారని, విజ్ఞానాన్ని వికసింపజేయాల్సిన

విద్యాలయాలు వ్యాపార కేంద్రాలుగా మారాయన్నారు. విద్యార్థులకు సృజనాత్మకంగా పాఠం చెప్పడానికి సిద్ధంగా ఉన్న సమర్థుడైన ఉపాధ్యాయునికి స్వేచ్ఛలేదని, యాజమాన్యం నిర్దేశించిన పాఠ్యాంశాలను సంస్థ పద్ధతుల్లోనే చెప్పాల్సిన పరిస్థితు లున్నాయన్నారు. విద్యార్థులు విద్యనార్జించే లక్ష్యానికి దూరంగా మార్కులు, ర్యాంకుల యావలో బతుకుతున్నారన్నారు. మొత్తంగా జీవితానికి సంబంధంలేని అంశాలను బలవంతంగా అమలు చేయాల్సిన పరిస్థితుల్లో పరాయీకరణ తీవ్రంగా ఉందన్నారు. పిల్లల మధ్య అనారోగ్యకర పోటీకి ఆస్కారం ఉండటంతో మనిషికి మనిషికి మధ్య అంతరానికి బీజం పడుతుందన్నారు.

**మారిన మానవ స్వభావం రూపురేఖల తీరుకు రూపాన్నిచ్చిన డాక్టర్ సూర్యప్రకాశరావు ప్రసంగం:**

"పరాయీకరణ – మానవస్వభావం" అంశంపై డాక్టర్ సూర్యప్రకాశరావు చేసిన ప్రసంగం ఆధునిక మానవుని ఆలోచన తీరుకు అద్దంపట్టింది. మనిషి తన స్వభావానికి అనుగుణంగా జీవించలేకపోవడాన్నే పరాయీకరణ అంటారన్నారు. పాలకుల భావాలే ప్రజల భావాలుగా ప్రచారం కావడంతో పరాయీకరణ దుష్ఫలితాలను ప్రజలు కర్మ సిద్ధాంతం ప్రభావంతో భరించేస్తున్నారన్నారు. మార్క్స్ ప్రకారం... తన అవసరాలకోసం, ఇతరుల అవసరాల కోసం ఉత్పత్తి చేసే శ్రామికుడే మనిషి. శారీరక లేదా మానసిక శ్రమతో సంబంధం లేని వారిని మనిషిగా పరిగణించలేమన్నారు. ఆధునిక కాలంలో తయారయ్యే వస్తువుల్లో శ్రామికుల శ్రమ ప్రత్యక్షంగా కనిపించడంలేదని, యంత్రాలతో తయారవుతున్నందున శ్రామికుని ప్రభావం లేదనిపిస్తుందన్నారు. కానీ ఆ వస్తువు తయారీకి వినియోగించే యంత్రాలు సైతం శ్రామికుల మానసిక శ్రమ నుంచి పుట్టుకువచ్చినవే అన్న విషయాన్ని గుర్తించాలన్నారు. శ్రామికులు బద్ధకించేందుకు లేదా విశ్రాంతి తీసుకునేందుకు ఇష్టపడతారన్నది ఇటీవల కాలంలో ప్రచారంలో ఉందని, అది అవాస్తవం అన్నారు. యాజమాన్యం శ్రామికుడిచే భరించలేనంత పని చేయించుకున్నప్పుడు శ్రామికుడు విశ్రాంతిని కోరుకుంటాడని, ఆ నేపథ్యాన్ని శ్రామికుడు పనిచేయడానికి ఇష్టపడటం లేదంటూ వ్యాఖ్యానించడం సరికాదన్నారు.

.......

సాంస్కృతిక రంగంలో పరాయీకరణను సాహితీ స్రవంతి నాయకులు కవి గనారా వివరించారు. డబ్బు, పలుకుబడి, సరుకు ఆరాధన నేపథ్యంలో మనిషి తన వాస్తవిక జీవితానికి దూరంగా జీవిస్తున్నాడన్నారు. రోజువారీ జీవితంలో కవిత, కథలు, కళా ప్రదర్శనలకు మనిషి దూరంగా జీవించే పరిస్థితులు తలెత్తి పరాయీకరణ ప్రభావానికి గురవుతున్నాడన్నారు.

సాంస్కృతిక కార్యకర్త కట్టా కృష్ణారావు, విద్యార్థి నాయకులు సిద్ధూ, ప్రధానోపాధ్యాయులు వెంకటేశ్వర్లు, డా. రామారావు తదితరులు "ఎలియనేషన్" పుస్తకంపై ప్రసంగించారు.

**ప్రయత్నం ఫలప్రదం:**

డాక్టర్ చెలికాని రామారావు స్మారక సమితి నిర్వాహకులు డాక్టర్ స్టాలిన్ గారు తదితరులు చేసిన సమాలోచన కార్యక్రమం ఒక గొప్ప సైద్ధాంతిక అంశాన్ని ప్రజల్లో చర్చకు పెట్టారు. ఇప్పటి వరకూ మార్క్సిస్టు గ్రంథాల్లో ఒక పేరాగా ఉన్న ఎలియనేషన్ అనేదాన్ని ఒక పుస్తకంగా విస్తరింపచేసి మానవ మస్తిష్క వికాశానికి పాటుపడిన రచయిత రావు కృష్ణారావు గారు అభినందనీయులు. విశాలాంధ్ర బుక్ హౌస్ ద్వారా అందుబాటులోకి వచ్చిన ఎలియనేషన్ పుస్తకాన్ని చదవడం ద్వారా సామాజిక బాధ్యతను నెరవేర్చాలని ఆకాంక్షిస్తున్నాను.

✳ ✳ ✳ ✳ ✳

# ముగింపు

మానవాళి సామాజిక క్రమంలో తప్పనిసరిగా ఎదుర్కొని పురోగమించాల్సిన అంశం 'పరాయీకరణ'. నిత్య జీవితంలో అనేక రకాలుగా దోచుకోబడుతున్న పీడిత సమూహాలకి దీనికి సంబంధించిన అవగాహన తప్పనిసరి. ఐతే, దురదృష్టవశాత్తూ భారతీయ వామపక్ష తాత్విక స్రవంతుల్లో ఇందుకోసం జరగాల్సినంత సంవాదం జరగలేదు. ఈరోజు జరగక తప్పని పరిస్థితి ఉంది. ఆ క్రమంలో మా వంతుగా చేస్తున్న చిరు ప్రయత్నం యిది. భవిష్యత్తులో మరింత సమగ్రమయిన యత్నాలు సాగాలనేదే మా ఆకాంక్ష.

అందులో భాగంగా పరిమితంగా అయినా దోపిడీ, పీడనలకు వ్యతిరేకంగా ఆచరణాత్మక యత్నాలు ఎక్కడికక్కడ బహుముఖ రూపాల్లో, బహుళ మార్గాల్లో, ముఖ్యంగా బహుజన శ్రేణుల్లో విస్తృతంగా, విశాలంగా జరగాల్సిన అవసరం ఎప్పటికంటే ఎక్కువ ఉందనేది నా అభిప్రాయం. అందుకు ఏమాత్రం ప్రేరణ కలిగించే అవకాశాలనయినా అందిపుచ్చుకుని, అవసరమైతే దీర్ఘకాలిక త్యాగాలకు సిద్ధపడే యువత తయారుకావాలి.

"దురాశ, క్రూరత్వం, కపటత్వం పెట్టుబడిదారుల విశిష్ట లక్షణాలు" అంటారు మార్క్స్. అందుకు ప్రతిగా ఆశ, మానవత్వం, పోరాటం అనేవి మానవాళి లక్షణాలు కావాలి. ఇవి అనివార్యంగా స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వాలకి దారితీయాలి. అంతిమంగా ప్రజాతంత్ర వ్యవస్థ నిర్మాణమే లక్ష్యం కావాలి. "ప్రజాస్వామ్యం నుండి విడివడి ప్రత్యేకంగా కమ్యూనిజం కోసం చేసే పోరాటం ఏదీ ఉండదు" అంటాడు లెనిన్. అలాగే పరాయీకరణకి వ్యతిరేకంగా జరిపే సాంస్కృతికోద్యమం నుండి విడివడి సమానత్వం కోసం జరిపే పోరాటం కూడా ఏదీ ఉండబోదు.

**– సంపాదకుడు**